ఫిబ్రవరి 1979

నవలానుబంధం

# లవ్ బర్డ్స్

తోటకూర ఆశాలత

ముఖచిత్రం :

బాలి


ముద్రణ :

శ్రీ గాయత్రీ ప్రెస్, విజయవాడ-11

స్నేహ

సకుటుంబ మాసపత్రిక

సీతారామపురం

విజయవాడ-520 004

TPLA133M122

పూర్వాసంధ్యా సమయంలో వికసించే పద్మం పర సంధ్యవేళ ముడుచుకుపోతుంది. ప్రొద్దుతిరుగుడు పువ్వు సూర్యుడివైపే దృష్టిసారించి తలత్రిప్పుతుంది. ఎందువల్ల? అంటే 'ప్రకృతి సహజం' అని చెప్పాలి. అలాగే పురుషుని సాంగత్యములో స్త్రీ, స్త్రీ సాంగత్యములో పురుషుడు ప్రభావితం కావడం జరుగుతూంది. అది మానవనైజం. కాలం మనిషి స్వరూపములోనే కాదు, అభిరుచుల్లోను - అనుభూతుల్లోను, గణనీయమైన మార్పుల్ని తెస్తుంది. వయసు తొందరపెడ్తున్నప్పుడు చేసే చిలిపి చేష్టలు, పొందే వింత అనుభూతులు భావజలధిలో పగడాల్లా మిగిలిపోతాయి.

లుంగీలు ధరించి పేకాటలో మునిగిపోయి వున్నవార్ని చూస్తే విద్యార్థులు అని ఎవరూ అనుకోరు. కాని వారు విద్యార్థులే! అంటించివున్న సినీతార అర్ధనగ్న ఫొటోలు, అల్మైరాలో వున్న పుస్తకాలు అదిక్లబ్ కాదని, స్టూడెంట్సు గదని చెప్పక చెబుతున్నాయి, ఆరోజు ఆదివారం కావడం వల్ల - అదీ కాలేజీ తెరచి రెండువారాలే కావడంవల్ల పుస్తకాలు మర్చిపోయారు. పేకాటలో మునిగిపోయారు. ఉదయం పనిమనిషి ఫ్లాస్కుతో తెచ్చిన కాఫీ ఏడుగంటల వేళ బెడ్ కాఫీగా సేవించి పేకాట అనే పుణ్య కార్యక్రమంలో మునిగిపోయారు. ప్రక్కవాడు పేకముక్కలు చూస్తే సహించదుగాని, పెట్టెలోని సిగరెట్ చొరవగా తీసుకున్నా మాట్లాడంలేదు. చేతిలో సిగరెట్ అందుకొని ఒకటి అరా పఫ్ లాగినా పట్టించుకోవటములేదు. ఎన్ని డ్రాప్ లిచ్చాను ఎన్ని కౌంట్ లిచ్చాను అని మాత్రమే లెఖ్ఖ జూసుకుంటున్నారుగాని టైమ్ సంగతి మర్చిపోయారు. చేతికుండవలసిన గడియారాలు వారిని డిస్టర్బ చేయడం ఇష్టంలేక కాబోలు అల్మైరాలో జోగుతున్నాయి.

ఆట జోరుగాసాగుతుంది. ద్వారానికి ఎదురుగాకూర్చున్న పేకాటపులి, "అమ్మ ఒకజోకర్ రావే... నీ పేరుచెప్పుకొని రాత్రికి బీరు పార్టీ చేసుకుంటాను" అంటూ ముక్కల్లోకి చెయ్యి పెట్టాడు. కాని ఎత్తిన ముక్కను పారెయ్యనూ పారేస్తున్న ముక్కల్లోకి వెళ్ళక పోవడంతో "ఏమిట్రా నస.. త్వరగా ముక్కెయ్యక" అంటూ విసుక్కుంటున్న ప్రక్కనున్న వాడికి. దృష్టి ద్వారంవైపు నిలిచుండటం గమనించి ద్వారం వెపు దృష్టి సారించాడు అంతా!! తెరచిన నోటిని మూయడమే మర్చిపోయాడు. వారిద్దరూ అలా నోట మాట రాక ద్వారంవైపే గుడ్లప్పగించి చూస్తూండటంతో ...గతా

వారుకూడా అప్రయత్నంగా అటువైపు చూశారు. చిత్తరు వుల్లా మారిపోయారు.

లయోలా కాలేజీలో మూడవ సంవత్సరం డిగ్రి కోర్సు చదువుతున్న వారంతా అలా విస్మేరపోయి చూడ టానికి కారణం_ గుమ్మంలో నిల్చున్న వ్యక్తే। అతడు ప్రిన్సిపాల్ ఫాదర్ తెక్ మురె కాదు; బోటనీ డిపార్ట్ మెంట్ హెడ్ భగత్ సింగ్ అంతకన్నా కాదు. పోత పోసిన కంచు విగ్రహంలా నల్లగా, కుదేసిన గోతంలా బొద్దుగా, పొట్టిగా వున్న ఆ వ్యక్తి పేరు వెంకటపతి. కిర్రు చెప్పులు ధరిం చిన అతడు కొత్తపంచె కాసెపోసి కట్టాడు. అతడి భుజంపై ఒక పాత ట్రంకు పెట్టివుంది.

విస్మయంగా చూస్తున్న వారిలో ముందుగా తేరు కున వ్యక్తి_ సదరు గది అధిపతి_ మధు." ఒరేయ్ పతీ! ఏమిట్రా ఈ అవతారం" అంటూ జారిపోతున్న లుంగీని ఎగగటుకుంటూ వెంకటపతిని సమీపించాడు మధు.

"బావా." అంటూ ముఖాన్ని చేటంత చేసుకుని "లయోలా కాలేజీతో సీటొచ్చిందని లెటరు వ్రాశావుగా." అన

"ఘనకార్యం చేశావువే. ముందా పెట్టిదించి లోప లికిరా" అంటూ తిరుగుముఖం పట్టాడు మధు.

చిన్నబోయిన వదనంతో అనుసరించాడు వెంకట పతి. భుజాల మీదకు పడుతున్న జుట్టుతో, చిన్నసైజు గున్న శరీరంతో శోభిల్లుతున్న వెంకటపతిని చూసి "ఎక్క డిదిరా బాబూ ఈ స్పెసిమన్ కాపీ" అన్నట్టుగా కొశ్చను మార్కు ముఖం వేసుకుని చూస్తున్న మిత్ర బృందాన్నుద్దే శించి "వీడు వెంకటపతి అని మా వూరే! టెన్తు క్లాసు పాసయ్యాడు. మన కాలేజీలో "బైపిసి। సీటొచ్చింది" అని పరిచయం చేశాడు మధు.

తన గురించే చెబుతుంటే ఏం చేయాలో తోచక వెకిలి నవ్వొకటి నవ్వాడు వెంకటపతి.

అంతలో ఏదో గుర్తొచ్చిన వాడిలా, "అవునూ నిన్న పోయిన సోమవారం నాడే రమ్మని లెటరు వ్రాస్తే ఈ వేళ దిగావేమిటి" సిగరెట్ అందుకుంటూ అడిగాడు మధు.

"నీ ఉత్తరం సోమవారం నాడే అందింది గూడెంలో. వాడు మంగళవారంనాడు గాని చెప్పులివ్వలేదు"

"బ్రదర్ ఒకరోజు ఆలస్యమయినా కుట్టిస్తే కుట్టించావు గాని, బ్రహ్మాండమైన చెప్పులు కుట్టించావు. రెండు సంవత్సరాల వరకు అరగవు" అని అంటున్న వ్యక్తి మాటలు వినగానే ఆనందంతో వెంకటపతి ఛాతి ఉప్పొంగింది "ఊరుకోరా" అని స్నేహితుడ్ని మందలించి, "మరయితే వెంటనే రాకపోయావా ! హాస్టల్ సీటు దొరుకుతుందో లేదో..." స్వగతంగా అనుకున్నట్టే అనుకొని బయటకు అన్నాడు మధు.

"నేను వెళ్తానన్నాను కాని బుధవారంనాడు పుల్లైనా పుట్టింటినుంచి బయల్దేరదట ! ఇహ గురువారం అష్టమి. అష్టమి నాడు ఏ పని చేసినా కష్టాలు తప్పవంట!! నవమి శుక్రవారం మంచిది కాదని బామ్మవద్దంది. అందుకే ఈవేళ బయలుదేరి వచ్చాను," "ఖర్మ...వీడ్నిలాగే వదిలేస్తే ఇంకా ఏం వాగుతాడో" అనుకొని, అల్మైరాలో వున్న గడియారం చూసి "అరె...అప్పుడే ఒకటిన్నర అయిందిరా పాపం మెస్ ముసలమ్మ మనకోసం ఎదురుచూస్తూ వుంటుంది. భోజనానికి వెళ్దాం, లేవండిరా" అంటూ సమాధానం కోసమైనా ఎదురుచూడకుండా టూత్ బ్రష్‌మీద పేష్టు వేసుకొని టవల్ చేతబట్టుకొని బాత్రూమ్ వైపు నడిచాడు మధు.

ఇహ మిగతావారు కూడ. తప్పదన్నట్టుగా లేచి ప్రక్కనున్న తమ గదుల వైపు కదిలారు.

కాలేజీకి వస్తే మధ్యాహ్నం కూడ ముఖం కడుక్కో-వాలికాబోలు. అనుకున్న వెంకటపతి, బాత్రూమ్ నుంచి తిరిగివచ్చిన మధుని అదేప్రశ్న అడిగాడు.

"ఛా వెధవా, నోర్మూయ్. అయినా ఈ పంచెకట్టు ఏమిటి? నీ అవతారం ఏమిట్రా" అడిగాడు.

"తొలిసారిగా కాలేజీకి వస్తున్నాను కదా, అందుకని తాతయ్య పంచెలుపెట్టి కట్ట బెట్టింది బామ్మ."

"నీ జుట్టు—నీ పంచె బాగుందిగాని, ముందా పంచె మార్చు భోజనానికి వెళ్దాం" అన్నాడు మధు.

మారు మాట్లడకుండా పంట్లాం మార్చుకున్నాడు.

భోజనానికి వెళ్ళడానికి మధు గదికి వచ్చిన మిత్ర బృందానికి వెంకటపతి ధరించిన, ఫాంటును చూడగానే అది పైజమానా? లేక ఫంట్లామా అన్న అనుమానం కలిగింది. కారణం — అది క్రింద ఎంత వదులుగా వున్నదో పైనా అంతే వుంది

చివరకు ఏదైతేనేం, లోట లోటా ఫాంట్లం వూపుకుంటూ కాలి చెప్పులు 'కిర్రు' మని వింత శబ్దం చేస్తుండగా భోజనం చేయడానికి వారితో పాటు మెస్‌కి బయలుదేరాడు వెంకటపతి. భోజనాలు పూర్తిచేసి తిరిగి సిటింగ్ వేయవలసి వుంది. కాని అందుకు భిన్నంగా మధు డ్రస్ చేసుకోవటం గమనించి, "నీవు సిటింగ్ వేయడంలేదా" అనడిగాడు ఒక మిత్రుడు.

"లేదురా ముందు వెంకటపతికి హాస్టల్ సీటు చూడాలి"

"కాలేజి అడ్మిషన్ పూర్తికానిదే హాస్టల్ సీటెలా ఇస్తారురా ?" మరొక మిత్రుడు అడిగాడు.

"లాస్టియరు డిగ్రీ స్టూడెంట్సువి అయి వుండి ఫాదర్ అరకొలన్‌ని ఆమాత్రం కన్విన్స్ చేయలేమా ?"

అని చివరిక్షణంలో వెళ్ళి పీకలమీద కూర్చొనేకంటే ముందే మేల్కొనడం మంచిది॥ తల దువ్వుకుంటూ అన్నాడు.

"అరకాల్ అంటే పాపం ఆయనకు ఏ యాక్సిడెంటులోనో సగం కాలు పోయివుంటుంది" అనుకుంటున్న వెంకటపతి.

"రారా" అన్న మధుమాటలతో బయలుదేరాడు.

కాలేజీ రోడ్డుపట్టిన మధుని అడిగాడు. "బావా! ఆదివారంనాడు కూడ ఆఫీసులు పనిచేస్తాయా" అని.

"కాలేజీ ఆఫీసుపని చేయదుగాని, హాస్టలు ఆఫీసు పని చేస్తుంది. హాస్టల్ సీటు దొరకడం కష్టం అందుకని ముందుగా వార్డెన్‌ని కలవటానికి వెళ్తున్నాం ఫాదర్‌ని పరిచయం చేయగానే నమస్కారం చెయ్యి..."

"నేను నీతోపాటే, గదిలో ఉంటా బావా" నసిగాడు.

"దానికి కొంత టైముంది. ఇప్పట్నుంచే డేస్కాలర్‌వి అయితే, అందునా మాతోపాటు వుంటే నీవు ఇంటర్మీడియట్ కోర్సు పూర్తి చేయవు.

"నేను తెల్లారగట్ట లేచి చదువుతా బావా!"

"ఎందుకు మా నిద్రలు పాడు చేయటానికి, ఆ తర్వాత నీవుపాడవటానికా?" అన్నాడు మధు.

అంతలో కాలేజీ మెయిన్ గేటు రావడంతో, ఇదేనా మన కాలేజీ అనడిగాడు.

"ఓరీడి దుంపతెగ, ఇంకా ఫీజుకూడ కట్టనే కట్టలేదు. అప్పుడే మన కాలేజీ అంటున్నాడే" అని స్వగతంగా అనుకున్నాడు. మధు. రణ భూమిలోకి అడుగు పెడుతున్న పార్థుడు తొలిసారిగా భూదేవికి నమస్కరించినట్టు, సింహద్వారంవద్ద వంగి నమస్కరిస్తున్న వెంకటపతిని చూసి ఉలిక్కిపడి, ఆ దృశ్యం ఎవరైనా చూశారేమో నని చుట్టుకంగారుగా చూసి మరుక్షణం కోడిజుత్తులా వున్న పతి జుల

పాలు పట్టుకుని లేవనెత్తాడు. "ఇలాంటి పిచ్చి వేషాలు వేశా వంటే ఇరగొట్టి అమ్మమ్మకు పార్సిలు చేస్తాను జాగ్రత్త" అన్నాడు బిక్కచచ్చిపోయిన వెంకటపతి కుక్కిన పేనులా మధు వెంట నడిచాడు.

కాని, రకరకాల ఆకృతుల్లో వున్న మూడంతస్తుల భవంతుల్ని చూడగానే పదవక్లాసు వరకు పూరిపాకల్లో చదువుకున్న వెంకటపతి హృదయం ఆనందంతో, అంతకు మించిన భయంతో గుండె దడదడ లాడింది. కాళ్ళుగాలిలో తేలిపోసాగాయి.

"అయ్యబాబోయ్; ఇంత పెద్ద బిల్డింగ్‌లో చదువు కున్నానని తెలిస్తే బామ్మ ఎంత సంతోషిస్తుందో" అను కుంటూ మధుని అనుసరిస్తున్నవాడల్లా, "ఇదే చర్చి" అన్న మాటలతో తృళ్ళిపడి చూశాడు.

"చర్చి ఇలావుందేమిటి ? చుట్టూ పూల మొక్కలు చర్చికి రంగు రంగుల అద్దాలు స్తంభంలా కట్టిన రాతిగోడ చివర పెద్దగంట" కళ్ళుపెద్దవిచేసి నమ్మలేనట్లుగా చూస్తూ అడిగాడు.

"మరి చర్చి అంటే ఎలా వుంటుందనుకున్నావ్?"

"గూడెంలోలా పెంకుటిల్లు అనుకున్నాను"

"గొప్పపని చేశావులే" అని నవ్వి "భారతదేశంలోని పెద్ద పెద్ద చర్చిల్లో ఇదొకటి_మరోసారి చూద్దువుగాని ఫాదర్ దగ్గరికెల్దాం మొదట" అంటూ ఫాదర్స్ క్వార్టర్స్ వైపు దారి తీశారు.

కొండ. కొండ ప్రక్కన కాలేజి బిల్డింగులకి ఒక ప్రక్క చర్చి, మరోప్రక్క తోటలు. ఇటువంటిచోట చదువు కోడానికి ఎంతైనా పెట్టిపుట్టుండాలి అనుకుంటూ నడుస్తున్న వాడల్లా, తెల్లని గౌను ధరించి బవిరి గడ్డంతో చీకేసిన మామిడిటెంకలాంటి బోడితలతో, ముక్కుమీదకు జారిన

కళ్ళజోడుతో ఆడపిల్లల సైకిల్ త్రొక్కుకుంటూ వస్తున్న వ్యక్తిని విభ్రాంతిగా చూస్తుండి పోయాడు.

"నమస్తే ఫాదర్" అని మధు విష్‌చేశాడో లేదో సైకిలు తక్కున అగింది. అప్రయత్నంగా "నమస్తే" అంటూ చేతులు జోడించాడు వెంకటపతి.

"ఎవరీ అబ్బాయి" చొరవగా వెంకటపతి బుగ్గ పట్టుకొని, ప్రేమగా కళ్ళద్దాల నుంచి చూస్తూ మధుని అడిగాడు.

"మా మేనల్లుడు"

"ఐసీ గుడ్‌బాయ్" అని మీ మావయ్యని చూడటానికి వచ్చావా" అడిగాడు.

"నో ఫాదర్... మావాడికి ఇంటర్మీడియట్‌లో సీటొచ్చింది. హాస్టల్ సీటుకోసం మీ దగ్గరకే బయలుదేరాం"

"ముందు వార్డెన్‌ని కలవటానికి వెళ్తున్నాం ఫాదర్‌ని పరిచయం చెయ్యగానే నమస్కారం చెయ్యి" అన్న మధు మాటలు గుర్తుకొచ్చి "మీరేనా ఫాదర్ అరకోల్... నమస్తే" అంటూ మరోమారు చేతులు జోడించాడు.

"ఓ మైగాడ్ ప్రాణం తీశావుగదరా" అనుకొంటూ తల పట్టుకోబోయి. ఎదురుగా ఫాదర్ వున్నాడన్న సంగతి గుర్తుకు రాగానే ఆ ప్రయత్నం మానుకున్నాడు.

"నా పేరు మీకెలా తెలుసు?" ఒకచేత్తో సైకిల్ పట్టుకొని మరో చెయ్యి వెంకటపతి భుజంమీద వేసి హాస్టల్ వైపు దారితీస్తూ అడిగాడు ఫాదర్ అరకాల్ ఒక్క నిమిషం ఆలస్యం చేస్తే ఏం వాగుతాడోనని భయపడిన మధు.

"మావాడికి తల్లిదండ్రి లేరు బామ్మదగ్గరే పెరిగాడు. ఇన్నాళ్ళకు ఇల్లు వదిలి వస్తుంటే 'కుర్రకుంక' ఆలనా పాలనా ఎవరు చూస్తారా అని బామ్మ బాధపడుతుంటే నేనే

మీ విషయం చెప్పాను." అని తడుము కోకుండా చక్కని కధ అల్లి చెప్పాము.

"ఓ ఐసీ," అని "మీ అమ్మనాన్న ఎలా చని పోయారు" లాలనగా అడిగాడు ఫాదర్

"శ్రీరామనవమికి భద్రాచలం పడవలో బయలు దేరారు. పడవ మునిగి మొత్తం డెబ్భైమంది చనిపోయారు వారిలో వెంకటపతి తల్లిదండ్రి వున్నారు."

"ఓ మైగాడ్" అంటూ క్రాస్ చేసుకొని, నీవేం బాధ పడకు బాబూ, ఆ లార్డ్ నిన్ను దయగా చూస్తాడు" అప్యాయంగా తలనిమురుతూ అన్నాడు ఫాదర్ అరకాల్.

కాని వెంకటపతి దృష్టి అంతా ఫాదర్ కాళ్ళమీదే వుంది. 'అరకాల్' అన్నారు. కాని కాళ్ళు రెండూ బాగానే వున్నాయి. బాగానే సైకిల్ త్రొక్కాడు; బాగానే నడుస్తు న్నాడు. ఏమైనా రబ్బరు కాలు వేయించుకున్నాడా ఇత్యాది సందేహాలతో సతమతమై పోతున్నాడు వెంకటపతి.

"మిస్టర్ మధూ...మీవాణ్ని చూస్తుంటే సీటు ఇవ్వా లనేవుంది, కాని నిన్ను చూస్తే ఇవ్వాలనిపించడంలేదు.

'కాలికి మెడకి వేశాడురా' అనుకొని "అదేమిటి ఫాదర్ అంతమాటన్నారు" వినయం ప్రదర్శించాడు.

"నో మధూ ఇంటర్మీడియట్‌లో రెండు సంవత్స రాలు నా హాస్టల్‌లో వున్నావు. అప్పుడు ఫాదర్ అంటూ ఎంత విధేయతతో వుండేవాడివి ఇప్పుడెలా వుంటున్నావ్!"

"సారీ ఫాదర్, అప్పుడెలా గౌరవించేవాడ్నో ఇప్పుడు అలాగే గౌరవిస్తున్నాను. కాకపోతే అప్పుడు హాస్టలర్ని గనుక రోజూ కనిపించే వాడ్ని. ఇప్పుడు డే స్కాలర్ని అయ్యాను. మిమ్మల్ని డిస్టర్బ్ చేయడం అవుతుందేమోనని..."

"సారీ మైడియర్ బోయ్ ... ఇంటర్మీడియట్‌లో ఫాదర్ అది తెలియలేదు, ఇది తెలియలేదు అంటూ అడిగి చెప్పించుకునేవాడివి. ఇప్పుడు అడుగుతున్నావా? పైగా బోటనీ క్లాసులో ఫస్ట్ బెంచీలో వున్నవాడివి కెమిస్ట్రీ క్లాసు అనగానే లాస్ట్ బెంచీకి పోతున్నావు. ప్రక్కవాళ్ళతో ఆటలు ఆడుతున్నావు. అవన్నీ నేను గమనించడం లేదను కోకు. నీవు ఆర్గానిక్ కెమిస్ట్రీకి ట్యూషను పెట్టుకున్నావని నాకు తెలుసులే" నిష్టూరంగా మాట్లాడాడు ఫాదర్ అరకాల్.

"క్షమించాలి ఫాదర్, మిమ్మల్ని ఏ విధంగానయినా బాధపెట్టినట్లుంటే నన్ను మన్నించు ఫాదర్...రేపట్నుంచి మీరు సరికొత్త మధుని చూస్తారు ఫాదర్" చిలకపలుకులు పలికాడు.

"ష్యూర్"

"ష్యూర్ ఫాదర్...మీకు అభ్యంతరము లేకపోతే నాకు కెమిస్ట్రీలో కొన్ని డౌట్సు వున్నాయి క్లారిఫై చేస్తారా?"

"ట్యూషను చదువుతున్నావుగా..."

"నో ఫాదర్ మీరు తీసుకున్నంత స్పెషల్ ఇంట రెస్టు వారు తీసుకోరు ఫాదర్" నక్క వినయం ప్రదర్శిం చాడు. "ఐసీ..."అర్ధ నిమీళిత నేత్రలతో చూస్తూ అన్నాడు.

"ఫాదర్ మా వాడి హాస్టల్ విషయం అని అర్ధోక్తిలో ఆగిపోయాడు.

"లగేజ్ ఎక్కడ వుంది..."

"ఈ వేళ ఉదయమే వచ్చాడు మీతో చెప్పి తీసు కొద్దామని లగేజ్ నాగదిలోనే వుంచాను."

"ఆలస్యం దేనికి తీసుకు వచ్చెయ్..."

"కాలేజీ ఫీజు రేపు కడతాడు ఫాదర్..."

"ఇటీజ్ ఆల్‌రైట్ నీవంటే నాకు ఎఫెక్షను వుంది గాని నీకే నేనంటే రెస్పెక్ట్ లేకుండా పోయింది"

"ఎక్స్క్యూజ్‌మీ ఫాదర్..." ఇహ ఎక్కువ మాట్లాడటం శ్రేయస్కరం కాదనుకున్నాడు మధు.

"బాబూ నీ పేరేమిటి ?" బుజ్జగిస్తున్నట్లుగా వీపుపై నిమురుతూ అడిగాడు. పులిలాంటి మధు బావ పిల్లిలా ఎలా ఫాదర్ ముందయితే నంగి నంగి మాట్లాడు తున్నాడో, ఆ ఫాదర్- తెల్లనిగౌనుని క్రిందకు మీదకు ధరించిన ఫాదర్- ఆ విధంగా అడిగేసరికి రాముని ఎదుట నిలబడిన హనుమంతుడిలా మారి పోయాడు వెంకటపతి.

పేరు చెప్పాడు.

"గుడ్ ఈ హాస్టలో కొన్ని రూల్సు వుంటాయి వాటి కనుగుణంగా డిసిప్లిన్‌తో మెలగాలి. వెంకటపతి ఈజ్ ఎ గుడ్ బాయ్ అనిపించుకోవాలి."

"అలాగే సర్" అలవాటు ప్రకారం అనేశాడు.

ఫాదర్ అరకాల్ ముఖం చిన్నబోయింది

'ఓహో' అని పళ్ళు పటపట లాడించాడు మధు.

అంతలో 'ఫాదర్' అంటూ హస్టల్ మెస్ వ్యవహారాలు చూసే బ్రదర్ రావడంతో, "ఓ కె ఫాదర్ థ్యాంక్యూ వెరీమచ్ లగేజ్ తీసుకొని వస్తాం" అన్నాడు మధు.

"ఓ. కే అనడంతో తిరుగు ముఖం పట్టారు.

తమ మాటలు ఇహ ఫాదర్ అరకాల్‌కి వినిపించవు అని నిర్ధారించుకున్న తర్వాత, "వెంకటపతీ! ఒక ముఖ్యమయిన విషయం చెబుతున్నాను గుర్తుంచుకో— లెక్చరర్లని 'సర్' అను...కాని తెల్లగౌను వేసుకున్న వాళ్ళని మాత్రం పొరపాటున కూడా 'సర్' అనకు తెల్లగౌనుమీద నడుముకి తెల్ల రిబ్బనులాంటిది కట్టుకుంటే 'ఫాదర్' అను. లేకపోతే బ్రదర్ అను. ఫాదర్ని పట్టుకొని 'సర్' అన్నా లెక్చరర్లని "ఫాదర్" అన్నా వాళ్ళకి కోపం వస్తుంది.

జాగ్రత్త "అర్జునునికి గీతోపదేశం చేసిన కృష్ణునిలా ఉపదేశించాడు."

"అలాగే" అని తన మనస్సుని దొలుస్తున్న ప్రశ్న- "అరకాల్ అన్నావు కాని ఆయన కాళ్ళు రెండూ సవ్యంగానే వున్నాయ్" అని అడిగాడు.

ఈ ప్రశ్నకి నవ్వకుండా వుండలేకపోయాడు. చివరకు అతి కష్టం మీద నవ్వాపుకొని. "అరకాల్ మాత్రమే కాదు ఇంచ్‌కాల్, కడవిల్, తిక్‌మూరి ఇత్యాది పేర్లు గలవారు వున్నారు. అరకాల్, ఇంచ్‌కాల్ అంటే సగంకాలు. అంగుళం కాలు వుంటాయని. కడవిల్ అంటే కొడవలి చేతబట్టుకొని తిరుగుతాడని, తిక్‌మూరి అంటేతిక్కతిక్కగా ప్రవర్తిస్తాడని అనుకోకు నీ పేరు చివర 'పతి' వుంది. పతి అంటే భర్త. నీవెవరికి భర్తవి!" అనడిగాడు. ఆ ప్రశ్నకి సిగ్గు మొగ్గయి మెలికలు తిరిగి పోయాడు వెంకటపతి.

"అవన్నీ కేవలం పేర్లు మాత్రమే! వాటి వెనుక అర్థాలు వెతక్కు" అని చెప్పాడు. చివరకు ఒక రిక్షా మాట్లాడి వెంకటపతి సామాను తీసికొచ్చి హాస్టల్‌లో చేర్పించాడు.

సామానంతా గదిలో పెట్టించి, "వెంకటపతీ! ఈ హాస్టల్‌లో మూడొందల మంది విద్యార్థులు వుంటారు. పంచెకట్టి పిచ్చి పిచ్చి వేషాలేయకు. కావలిస్తే ఆ పంచెను రెండుమడతలుగా వేసి లుంగీగా కట్టుకో. ఈ రాత్రికి ఎలాగోలా కాలం గడుపు. రేపు టాయిలెట్ సామాను, ప్లాస్టిక్ బకెట్, మగ్, రోవ్ ఎంపోరియమ్‌లో కొనిపెడతాను. స్టేషనరీ కూడా అక్కడే దొరుకుతుంది" అన్నాడు మధు.

"వద్దు బావా, అన్నీవున్నాయి" అంటూ ట్రంకుపెట్టి లోంచి చెక్క అద్దం, దంతపు దువ్వెన, ఇత్తడి చెంబు ఇత్యాదులు తీశాడు.

అన్నీ బయటకు తీయకు. రేపు నేనువచ్చి అన్నీ సరుతాను. ఈ రాత్రికి మెస్‌బెల్ మ్రోగినప్పుడు భోజనానికి వెళ్ళు జాగ్రత్త" అని చెప్పి వెళ్ళిపోయాడు మధు.

ఆవిధంగా హనుమంతుడు లంకానగర ప్రవేశం చేసినట్లు వెంకటపతి లయోలా కాలేజీ హాస్టల్ ప్రవేశం చేశాడు వెంకటపతిని హాస్టల్‌లో చేర్పించి వచ్చిన మధుని అడిగారు మిత్రులు, "బొండాం బాబుని అప్పుడే తరిమేశావ్ ఏమిట్రా" అని

"ఇప్పటికే పేకాడటం చూసాడు ఈ రాత్రికి బీరు పీసాల వ్యవహారం గూడా చూశాడంటే 'టాంటాం' చేస్తాడు అందుకని జాగ్రత్త పడ్డాను."

"మొత్తానికి వెన్నుండలా నిలువెంతవున్నాడో అడ్డమంత వున్నాడు. చూడముచ్చటగా" ఛమత్కరించాడు ఒక మిత్రుడు.

"మావాడు పొత్తిళ్ళలో బిడ్డగా ఉండగానే అమ్మా-నాన్న పోయారు. అందుకని వాళ్ళ అమ్మమ్మ అల్లారు ముద్దుగా పెంచింది."

"అదదీ సంగతి. వెన్నతో చేసిన సున్నుండల్ని పెట్టెలో చూడగానే నాకా అనుమానం వచ్చింది." మరొక మిత్రుని ఉవాచ.

"పంట్లాం చూస్తే బి. సి నాటి మోడల్‌లావుంది. జుత్తు చూడబోతే హిప్పీ క్రాప్‌లా పెంచేశాడు. అదేంటి గురూ" ధర్మ సందేహం వెలిబుచ్చాడు మరొక మిత్రుడు.

పదవ తరంగతి పాసైతే జుట్టు ఇస్తానని మొక్కు-కున్నాడట రిజల్స్ వచ్చిన నాటినుంచి పెంచడం ప్రారంభించాడట ?"

ఆ గదిలో ఒక్కసారిగా నవ్వుల జల్లు వెల్లివిరిసింది.

* * *

భోజనాలు పూర్తయ్యాయి. స్పీకరునుంచి అంగ్లంలో పాటలు ప్రారంభమయ్యాయి. ముగ్గురు నలుగురుచొప్పున ఎవరికి వారు గుంపులు గుంపులుగా చేరి ఏవేవో మాట్లాడు కుంటున్నారు. కాంపస్ మధ్యనున్న మెర్క్యూరీ దీపం తెల్లని కాంతిరేఖల్ని విరజిమ్ముతోంది. గార్డెన్‌లో విర బూసిన రకరకాల మొక్కల పూలగుత్తులు సౌరభాల్ని నలు దిక్కులకు వ్యాపింపజేస్తున్నాయి.

ఎవరితోనూ కలవలేక, ఎవరితో ఏం మాట్లాడాలో తెలియక బిక్కు బిక్కుమంటూ తోక తెగిన తోకచుక్కలా మిగిలిపోయాడు వెంకటపతి. ఆ వాతావరణంలో తిరగటా నికి ఒక ప్రక్క భయం. ఇటువంటి ప్రదేశములోకి అడుగు పెట్టగలిగినందులకు మరో ప్రక్క ఆనందం హృదయాన్ని ఆక్రమించగా ఉక్కిరి బిక్కిరి అవుతూ ఒంటరిగా ఇసుకలో కూర్చుండిపోయాడు. దృష్టిని నలువైపులా సారించాడు. కోడిగ్రుడ్డు ఆకారంలో వున్న ఆ హాస్టలులోని గదులన్నీ విద్యుద్దీపాలతో వెలిగిపోతున్నాయి.

'అబ్బ' ఇటువంటి వాతావరణంలో చదువుకోవడానికి ఎంతో అదృష్టముండాలి. అనుకున్నవాడికి హఠాత్తుగా "బామ్మ" గుర్తుకొచ్చింది. రోజూ మీగడ వేసి అన్నం ముద్దలు కలిపి నీకు పెడ్తేగాని నాకు కడుపు నిండినట్టుండ దురా అనేది. ఏం చేస్తుందో ఏమో అనుకున్నాడు.

బామ్మ గుర్తుకురాగానే అప్రయత్నంగా కనుకొలు కుల్లో నీరు నిలిచింది. ఇంటి తాలూకు జ్ఞాపకాలలో మునిగి పోయాడు. ఆ జ్ఞాపకాలలోనే ఎంతసేపు వున్నాడోగాని హాస్టల్ బెల్ వినిపించడంతో మెల్లగా లేచి గదివైపు నడిచాడు.

కాని ఏంచేయాలో తోచక పెట్టెలోని దిండు, దుప్పటి తీసి మంచంమీద పరుచుకొని పడుకున్నాడు. అప్పుడుగాని

గుర్తుకురాలేదు, తాను "కొత్తపంచె నలిగిపోతుంది" అనుకుంటూ పెట్టెలోనున్న నిక్కరు తీసి తొడుక్కొని, పంచె తీసి జాగ్రత్తగా మడతపెట్టాడు. తలుపు లోపల గడియ పెట్టి వచ్చి మంచంమీద పడుకున్నాడు. చిన్నసైజుగున్న శరీరంమీద పడేసరికి మంచం 'కీ' అంటూ మొత్తుకుంది. 'ఈ శాలీని భరించడం నావంతుకాదు' అన్నట్లుగా నవారు పట్టీలు రెండు మూడు 'పటపట' మంటూ తెగిపోయాయి.

'ఊహూ!' అంటూ అయిష్టంగా లేచి, దిండు, దుప్పటి నేలమీద పరుచుకొని వెల్లకిలా పడుకున్నాడు.

అలా పడుకున్న వెంకటపతి కళ్ళమీదకు నిద్ర తొంగి చూడలేదుగాని, హాస్టల్ బెల్ మాత్రం మోగింది.

"ఏమిటో ఈ బెల్స్! మాటమాటికీ మోగుతుంటాయి" అనుకుంటున్నవాడల్లా తనకు కొద్ది కొద్దిగా చెమట పడుతున్నట్టు గ్రహించాడు. వెంటనే లేచి షర్ట్ విడిచి పడుకున్నాడు.

చీకటితెరల్ని పారద్రోలటానికి ప్రయత్నిస్తున్నాయి వరండాలో అక్కడక్కడ వున్న విద్యుద్దీపాలు అంతటా నిశ్శబ్దం తాండవిస్తోంది. అ సమయంలో బాత్రూమ్స్ దగ్గర ఆవేళ విడిచిన దుస్తులకి సోప్ పెడుతున్న వ్యక్తి వింతశబ్దం వినరావడంతో ఆగాడు. ఆ శబ్దం దగ్గరకావడంతో, ఆందోళనగా, ఆశ్చర్యంగా చెవులు రిక్కరించి ఆ శబ్దం వినవస్తున్నవైపు దృష్టి సారించాడు.

పోతపోసిన కాంస్యవిగ్రహంలా నల్లగా, వినాయక చవితినాటి వినాయకుని బొజ్జవంటి బొజ్జతో తుమ్మమొద్దు మొదలు వంటి తొడలతో మల్లయోధుడిలా చిన్నలాగు ధరించి, మెడపై పడుతున్న నల్లని జుట్టుతో వింతశబ్దం చేసుకుంటూ వచ్చిన ఆ వింత ఆకారాన్ని చూడగానే,

"అమ్మోయ్ దెయ్యం" అని గావుకేక పెట్టి బిళ్ళబీటుగా విరుచు కొని పడిపోయాడు బట్టలకి సోప్ పెడుతున్న ఆ వ్యక్తి.

ఈ హఠాత్పరిణామానికి భయపడిన ఆ వింత ఆకారం యజమాని-వెంకటపతి ఒక్క ఉదుటున గదివైపు పరిగెత్తాడు. తలుపులోపల గడయ పెట్టి నేలమీద పరచిన దుప్పటి తీసికొని నిండా కప్పుకొని ఆ కటిక నేలమీదే పడుకున్నాడు. ఇహ ఆ తర్వాత బయట ఏం జరిగింది అన్నది తెలుసుకునే సాహసం చేయలేదు; అసలతను ఎందుకలా అరిచాడో వెంకటపతికే బోధపడలేదు.

అసలేం జరిగిందంటే___

చొక్కా విడిచి కేవలం నిక్కరుతో పడుకున్న వెంకటపతి కళ్ళ మీద కునుకు రాలేదు. ఉక్కపోత ఉధృతం కావడంతో, మెల్లగా తలుపుతీసి తలబయటకు పెట్టిచూశాడు. అప్పటి వరకు దేదీప్యమానంగా వెలిగిన గదులు అధిక శాతం చీకటి మాటున దాక్కున్నాయి.

'అంతా పడుకున్నట్టున్నారు' అనుకుంటూ వరండాలోకి వచ్చిన వెంకటపతి బొజ్జని వాయుతరంగం ఒకటి గాఢంగా కౌగిలించుకుంది.

'అబ్బ ఎంతహాయిగా వుంది' అని అనుకుంటూ స్తంభానికి చేరగిలబడి నిల్చున్న వెంకటపతిలో ఒక చిలిపి ఆలోచన చోటుచేసుకుంది. హాస్టలంతా ఒకసారి తిరిగివస్తే బాగుణ్ను అని వెంటనే బయలుదేరాడు.

ఆ విధంగా అతడిచేత గావుకేక పెట్టించి ఏమీ తెలియని వాడిలా తలనిండా దుప్పటి కప్పుకొని పడుకున్న వెంకటపతి అలాగేనిద్రలోకి జారిపోయాడు. తిరిగి అనిద్ర నుంచి మేల్కొన్న వెంకటపతి ప్రకృతిలో చీకటికి వెలుగుకి జరుపుతున్న సమరాన్ని చూసి "తెల్లవారుతోంది కాబోలు" అనుకుంటూ లేచాడు. రాత్రి జరిగిన సంఘటన

గురుకు రావడంతో 'అతనేమయ్యాడో, అసలేం జరిగిందో' అనుకుంటూ ఎందుకైనా మంచిదనుకొని నిక్కరు విడిచి లుంగీ చొక్కా ధరించాడు.

పెట్టిలో వున్న ఇత్తడి చెంబు తీసికొని పంపు దగ్గర నింపుకొని అలవాటు ప్రకారం బయలుదేరాడు. తమ ఊళ్ళో అయితే ఉదయాన్నే లేచి ఊరవతల వున్న పొదల్లోకి వెళ్ళేవాడు. ఇక్కడ ఎక్కడికి వెళ్ళాలి? అని చూశాడు.

రాజాచారి కోటలా ఉంది. హాస్టల్ కోట సింహ ద్వారంలా వున్న హాస్టల్‌గేటు ఇంకా తెరవబడలేదు 'ఏం చేయాలి, ఎక్కడికి వెళ్ళాలి' అని ఆలోచిస్తున్న వెంకటపతి

"అరె ఇంత ఎత్తు పూలతోటని ఎదురుగా పెట్టుకొని ఎందుకింతగా తల బద్దలుకొట్టు కుంటున్నాను. అనుకొని గార్డెన్‌లోకి నడిచాడు.

"ఏపుగా పెరిగిన మొక్క ఎక్కడుందా" అని చూడ సాగాడు అంతలో గేటుతెరవటానికి మెస్ వైపునుంచి వస్తున్న అటెండర్, చెంబు చేతపట్టుకొని, నిల్చునున్న వెంకటపతి వాలకాన్ని చూసి అనుమానించాడు.

"ఏమిటండి వెతుకు తున్నారు" అంటూ వెంకటపతిని సమీపించాడు.

"ఏం వెదకటం లేదుగాని, నువ్వెళ్ళు"

"చెంబు చేతపట్టుకున్నారు. బాత్రూమ్స్ ఆ వైపున ఉన్నాయి."

"మా ఊళ్ళో నాకు మొక్కల మధ్యకే వెళ్ళడం అలవాటు" అని "నీవు తొందరగాపో" కసురు కున్నాడు.

"అయ్యబాబోయ్, కొంప ముంచేసేవారివే రెండడుగుల ఆలస్యమయితే" అని "ఇది గార్డన్" అన్నాడు.

"నాకు తెల్సుగాని. ముందు నీవు పోతావా పోవా"

"ఇక్కడ మీరేదో ఘనకార్యము చేసేలా వున్నారు. నేనుపోతే. ముందు మీరు ఇక్కడ్నుంచి పోతారా పోరా" అంటూ రెండు చేతులతోను వెంకటపతిని వాటేసుకొని బాత్రూమ్స్ వైపు బలవంతాన లాక్కెళ్ళి ఒక బాత్రూమ్ లోకి నెట్టి తలుపేశాడు.

ఆ విధంగా వెంకటపతి హాస్టల్ జీవితంలోని తొలి రోజు తెల్లవారింది. సరిగ్గా తొమ్మిదిగంటలకు మధు వచ్చాడు కాలేజి ఫీజు చెల్లించడానికి ఆ రోజే ఆఖరిరోజు కావడంతో ముందాపని పూర్తి చేశాడు. ఎంపోరియమ్‌లో రూమ్‌లోకి కావలసిన సామానంతా కొని వెంకటపతిని హాస్టల్‌కి పంపి క్లాసుకెళ్ళి పోయాడు. సామాను గదిలో సర్దుతుంటున్న వెంకటపతి "మిమ్మల్ని వార్డెన్‌గారు పిలుస్తున్నారు"అంటూ అటెండరు రావడంతో హడలిపోయాడు.

"ఉదయం చెంబు తీసుకొని పూలమొక్కల్లోకి వెళ్ళానని వాడుగాని చెప్పలేదుకదా" అనుకుంటూ అతడ్ని అనుసరిస్తున్న వాడికి రాత్రిజరిగిన సంఘటన గుర్తు కొచ్చింది.

"ఛీ, హాస్టల్‌లోకి అడుగుపెట్టి అంతా ఇరవైనాలుగు గంటలు కాలేదు అప్పుడే ఉద్వాసన చెప్పించేలా వున్నారు" అని స్వగతంగా అనుకుంటూ వార్డెన్ గదిలోకి అడుగు పెట్టాడు.

"మిస్టర్ వెంకటపతీ! ఇతనిపేరు లక్ష్మణరావు నీ రూములో వుండబోయే రెండవ వ్యక్తి ఇతనే. మీరిద్దరూ అన్నదమ్ములకన్నా మిన్నగా ఎంతో సన్నిహితంగావుండాలి. ఒకరి అవసరానికి మరొకరు ఆదుకోవాలి" అంటూ ఏదో చెప్పుకుపోతున్నాడు. ఫాదర్ అరకాల్. కాని వారిద్దరిలో ఏ ఒక్కరూ ఫాదర్ మాటలు వినడంలేదు.

పొట్టిగా, సన్నగా, బోడిగుండుతో వున్న లక్ష్మణ్ అని చెప్పబడుతున్న ఆ వ్యక్తిని చూస్తూ, "వీడు నిజంగా ఫెస్ట్ క్లాసు పాసయి వచ్చాడా, లేక ఏ సెవెంత్ క్లాసు పాసైతేనో పొరపాటున ఫెస్ట్ క్లాసు పాసయ్యాడని సర్టిఫికెట్ ఇచ్చారా?" అనుకున్నాడు వెంకటపతి.

సరిగ్గా అదేసమయంలో నల్లగా, తుమ్మమొద్దులా, లూజు ఫంట్లాంతో బేబి ఎలిఫెంట్‌లా వున్న వెంకటపతిని చూసి, "వీడెవడ్రా బాబు! వీడితో కలిసి వుండటం ఎలా?" అనుకున్నాడు లక్ష్మణరావు.

"ఓ. కె. అరమయిందిగదా!" అడిగాడు అరకాల్. ఆయన ఏంచెప్పాడో వినకపోయినా "అర్ధమయింది" అన్నట్లుగా ఇదరూ ఒకేసారి తలూపారు.

"వెంకటపతీ, లక్ష్మణరావుని నీ గదికి తీసికెళ్ళు" అన్నాడు.

"యస్ సార్" అని, "కాదు ... కాదు ఫాదర్" తడబడ్డాడు వెంకటపతి.

"ఏమిటి వీడు ఇలా తడబడుతున్నాడు" అనుకుంటూ వెంకటపతివైపు చూశాడు లక్ష్మణరావు.

"ఓ - కె... అలవాటయ్యేవరకు ఇంతే వెళ్ళండి" అన్నాడు ఫాదర్.

మారు మాట్లాడకుండా బయటకు నడిచాడు వెంకటపతి, అనుసరించాడు లక్ష్మణరావు. అప్పటికే అటెండరు లక్ష్మణరావు సామానంతా గదిలోపెట్టి వచ్చాడు.

గదిలోకి చేరుకోగానే లొటలొటం ఫాంట్లం విడిచి పంచెను లుంగీగా చుట్టుకున్నాడు. అమ్మ, ఈ బుద్ధావతారంతో సంవత్సరమంతా గడపాలి కాబోలు అనుకుంటూ, తన సామాను తీసి మరో అల్మైరాలో సర్దుకున్నాడు లక్ష్మణరావు.

"తంతే పుట్‌బాల్‌లా కాలేజీ అవతల పడతాడు. ఈ గోళీగాడ్ని వేసుకొచ్చి నా రూమ్‌లో పెట్టారేమిటి ?"

"ఒరేయ్ మీవాడి రోల్ నెంబరు, రూమ్ నెంబరు ఒకటేరా" అన్న మాటలు వినిపించడంతో రూమ్ మేటు లిద్దరూ ద్వారంవైపు చూశారు.

మధు, మిత్ర బృదం వరండాలో నిలబడి వున్నారు.

ఆపూట వారికి కెమిష్ట్రి ప్రాక్టికల్స్, కెమికల్ అనాలిసిస్ ఎక్స్‌పెరిమెంట్. కాని మిక్చరు తయారు చేయనందున ఆరోజుకి ప్రాక్టికల్స్ కాన్సిల్ అయ్యాయి.

"రా బావా" అంటూ లోపలికి ఆహ్వానించాడు.

"పున్నారావు ! వెంకటపతి అని మా మేనల్లుడు జూనియర్ ఇయరు ఇంటరు బై.పి.సి.జాగ్రత్తగాచూసుకో" అని, పున్నారావు మీ బ్లాకు లీడరు, మా క్లాస్‌మేట్ - ఫ్రెండు" పరిచయం చేశాడు మధు.

ఏం చేయాలో అర్థంగాక అలాగే కళ్ళప్పగించి చూస్తున్న వెంకటపతివైపు రెండడుగులు వేసి గ్లాడ్ టూ సి యు" అని బలవంతాన చెయ్యి అందుకొని షేక్ హాండ్ ఇస్తూ, "మొదట గది నాదే, నీకు ఎప్పుడు ఏ సహాయం కావాలన్నా అడుగు" అన్నాడు.

తలూపాడు.

"వెంకటపతి" అని మీటో మై ఫ్రెండ్ వి.టి.ఎమ్. మీ మెస్ లీడరు" పరిచయం చేసాడు.

"వెరీ గ్లాడ్, టు సి యు" అని వెంకటపతికి షేక్ హాండు ఇచ్చి. "ఓ. కె. ఇహ నా గదికి వెళ్ళదామా" మధు నుద్దేశించి అడిగాడు.

"సీ.యూ." అని చెప్పి అంతా వి. టి. ఎమ్. గది వైపు నడిచారు.

కాని మధు మాత్రం మిగిలిపోయాడు. "వెంకట పతీ" అని ప్రక్కకు పిలిచాడు.

తాను అంత సేపట్నుంచి వెర్రి వెంగలాయ అనుకుంటున్న వ్యక్తి, వెర్రివాడు కాదని. వాడి వెనుక కొండంత అండవుందని గ్రహించాడు లక్ష్మణరావు.

ఆ క్షణం నుంచి వెంకటపతి అంటే రెస్పెక్టు, వర్షిప్ పెరిగింది.

"ఎవరయినా కొత్తవారు పరిచయం చేయబడి నప్పుడు, తటస్తపడినప్పుడు గ్లాడ్ టు సి యు, అంటూ షేక్ హాండ్ ఇవ్వాలి. నిన్ను పరిచయం చేయడానికి ఎవరూ లేనప్పుడు, నిన్ను నీవే పరిచయం చేసుకోవాలి" అని బోధ చేసి వెళ్ళిపోయాడు మధు.

గదిలోకి అడుగుపెట్టిన వెంకటపతికి ఎదురుగా కుర్చీ మీద కూర్చునున్న రూమ్‌మేట్ లక్ష్మణరావు అపరిచిత వ్యక్తిలా కనిపించాడు, వెంటనే "హలో లక్ష్మణ్ ! నా పేరు వెంకటపతి. ఈ రూము నంబరు నూట పదకొండులో వుంటున్నాను. వెరీ గ్లాడ్ టు సీ యూ" అంటూ షేక్ హాండు ఇచ్చాడు.

"లక్ష్మణ్" అని అందంగా ముద్దుగా అడ్రస్ చేస్తూ ఇంగ్లీషులో "గ్లాడ్ టు సి యు" అని అనడంతో ఉబ్బి తబ్బిబ్బయి, అంతకుముందే వార్డెన్ పరిచయం చేశాడన్న విషయమే మర్చిపోయి, "వెరీ గ్లాడ్ టు సి యు వెంకట్" అన్నాడు లక్ష్మణరావు.

"ఓ... వెంకట్ ! ఆహా, ఎంత చక్కని పేరు పెట్టావ్ ! నన్ను పెంచి పెద్దచేసిన బామ్మకూడా 'ఒరేయ్ పతీ' అని పిలిచేదేగాని ఇంత చక్కని పేరుపెట్టి ఎన్నడూ పిలవలేదు."

"ఎంతయినా నేను నీ ఫ్రెండునిగదా !"

"ఓ వెరీ గ్లాడ్ టు సి యు" మరో మారు షేక్ హాండ్ ఇచ్చాడు వెంకటపతి.

"నా దగ్గర నేతితో చేసిన కజ్జికాయ లున్నాయి తింటావా ?" అడిగారు లక్ష్మణ్.

"నా దగ్గర సున్నుండలు, వెన్నుండలు వున్నాయి. తిను" అంటూ అతడు అడిగిన ప్రశ్నకి సమాధానం ఇవ్వ కుండానే పెట్టెలో వున్న సున్నుండల డబ్బా, వెన్నుండల పీసాబయటకు తీశాడు. ఆవిధంగా తొలిచూపుల్లోనే ఒకకంట ఈసడించుకుంటూ, వేరొకకంటితో ఆగర్భశత్రువులా చూసు కున్నవారల్లా టంకం వేసి అతికించినట్టు ఒకటయిపోయారు. అంతలో కాలేజీ బెల్ మ్రోగడం, ఆ తర్వాత అయిదు నిముషాలలో, హాస్టల్ బెల్ మ్రోగడం జరిగింది ఏ బెల్ ఎందుకు ఎప్పుడు మ్రోగుతుందో వారికి ఎర్పడ లేదు. కాని కొందరు మగ్‌లు చేతపట్టుకొని డైనింగ్ హాల్‌వైపు వెళ్ళడం గమనించిన వెంకటపతి "లక్ష్మణ్ ఇది భోజనం బెల్ అనుకుంటాను. అందరూ డైనింగ్‌హాల్‌వైపు వెళు తున్నారు" అన్నాడు.

వెంకటపతి అంతటి మనిషి తనని లక్ష్మణ్ అని పిలవడం చాల సంతోషముగాను గర్వకారణంగాను వుంది.

వెంటనే బయటకు వెళ్ళి చూశాడు లక్ష్మణరావు.

నిజమే వెంకట్, మనమూ వెళ్దామా" అంటూ బాక్సులోని గ్లాసు తీశాడు. కాని వెంకటపతి మాత్రం ఉద యం మధు కొన్న 'మగ్' తీసుకొని బయలుదేరాడు.

"ఏమిటి, నీకు గ్లాసు లేదా ? ప్లాస్టిక్ లోటా పట్టు కొని భయలుదేరావ్ ?" అడిగాడు లక్ష్మణరావు.

"దీనిని 'లోటా' అనకూడదు. 'మగ్' అనాలి అందరూ ఈ మగ్‌లే తీసికొస్తారు. రేపు నీవుకూడ ఒక 'మగ్' కొను."

"ఎందుకు"! తలుపు గడియపెడ్తూ అడిగాడు.

చెవి దగ్గర వంగి, "ఉదయం కాఫీ ఈమగ్‌లోనే పోస్తారు. గ్లాసయితే తక్కువ పడ్తుంది. ఈ మగ్గు అయితే ఎక్కువ కాఫీ రాగొచ్చు" అన్నాడు వెంకటపతి.

"అదా సంగతి" అని, "ఎంతైనా నీ బుర్ర గొప్పదే గురూ" అన్నాడు.

తనని అంత కాలానికి, అదీ ఒక కొత్త వ్యక్తి మెచ్చుకునే సరికి, వెంకటపతి ఆనందంతో ఉప్పొంగి పోయాడు.

దాంతో పంట్లాం బటనొకటి 'ఫట్' మని తెగి పోయింది.

"దీని దుంపతెగ బటన్ తెగిపోయిందే" అనుకొని మొలత్రాడు పంట్లాంమీద వేసుకొని డైనింగ్ హాల్ వైపు దారితీశాడు వెంకటపతి.

డైనింగ్ హాల్‌లో ఒక మూలగా వున్న టేబుల్ దగ్గర కూర్చున్నారు.

సప్లయర్స్ వచ్చి అరటి ఆకులు పరచి వెళ్ళారు.

అప్పటికి కొంతమంది వస్తూనే వున్నారు.

అరటి ఆకును నీళ్ళతో కడుగుతున్న వెంకటపతి, హఠాత్తుగా లక్ష్మణ్ మోచేతితో పొట్టలో పొడవడంతో త్రుళ్ళిపడి చూశాడు.

"వాడి చెయ్యి చూడు" ఎదుట టేబుల్ దగ్గర కూర్చున్న వ్యక్తిని చూపించి మెల్లగా అన్నాడు.

అతడి చేతికి ఒక తెల్లని కడియం వుంది.

"ఔను పిచ్చి వెధవ ఆ చక్రం చేతికి వేసుకున్నాడేమిటి? మా ఊళ్ళో నేను అలాంటి చక్రాల్ని మేకు కర్రతో తిప్పుతుండేవాడ్ని" తన గొప్పతనాన్ని చెప్పాడు వెంకటపతి.

అదేదో ఫ్యాషన్ అనుకున్నాడు వెర్రివెధవ...వాడి జుట్టు, వాడి అవతారం చూడు" అంటున్నవాడికి అప్పుడు గాని వెంకటపతి జుత్తు భుజాల మీదకు పడుతుందని గ్రహించిన వెంటనే, "అవునూ నువ్వేమిటి జుట్టిలా పెంచావ్?" అనడిగాడు.

"టెన్త్‌క్లాసు పాసయితే జుట్టిస్తానని కాకాని స్వామికి మొక్కుకున్నాను."

"అలాగా" అని, "అవునూ ఇంతకీ మీదేవూరు" అడిగాడు లక్ష్మణ్.

"తెనాలి దగ్గర వలివేరు" సమాధానం చెప్పాడు వెంకటపతి, కాని 'మీదేవూరు' అని అడగాలన్న ఆలోచన రాక మౌనం వహించాడు. అంతలో సర్వింగ్ ప్రారంభ మవటంతో భోజనం పైకి దండయాత్ర ప్రారంభించాడు.

భోజనాలు పూర్తి అయ్యాయి.

'బ్రేవ్' మని త్రేన్చుతూ లక్ష్మణ్ వెంట వస్తున్న వెంకటపతి, కాంపస్ మధ్యలో నిల్చొనున్న ఫాదర్ అర కాల్నిని చూసి పలకరింపుగా నవ్వాడు.

సమాధానంగా ఫాదర్ నవ్వలేదు. కోపంగా చూస్తూ "ఇలారా" అని పిలిచాడు. ఆయన అలా చూడటం చూసి భయపడ్డాడు వెంకటపతి. మౌనంగా వెళ్ళిచేతులు కట్టుకొని అటెన్షన్ పొజిషన్‌లో నిలబడ్డాడు.

"ఫాదర్ ఎదురైతే — ఉదయం వేళయితే గుడ్ మార్నింగ్ ఫాదర్ అని, మధ్యాహ్నం పూటయితే, గుడ్ ఆఫ్టర్నూన్ ఫాదర్ అని, సాయంత్రం వేళయితే గుడ్ ఈవెనింగ్ ఫాదర్ అని విష్ చేయాలి. అలా నవ్వొకటి విసిరేసి వెళ్ళడం చాలా తప్పు".

"అలాగేఫాదర్" అని "గుడ్ ఆఫ్టర్నూన్ ఫాదర్" అన్నాడు.

ఫాదర్ ముఖం ఆనందంతో చాటంత అయింది.

"గుడ్ఆఫ్టర్నూన్" అన్నాడు.

"ఎపుడు ఎవరితో ఎలా మెలగాలి అన్నది నేర్పుతారు కాబట్టే వీళ్ళు ఫాదర్స్ అయ్యారు" అనుకున్నాడు. కాని ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రంవేళ స్టూడెంట్స్ అందరిచేతా విష్ చేయించుకోడానికే అలా స్టూడెంట్స్ వచ్చివెళ్ళే దోవలో నిలబడతారని ఎవరైనా పొరపాటున విష్‌చేయకపోతే పిలిచి మరీ క్రమశిక్షణ పేరుతో విష్ చేయించుకుంటారని వెంకటపతి గ్రహించలేకపోయాడు.

"చిన్నతనంలో మనమేదైనా పొరపాట్లుచేస్తేఅమ్మా నాన్న 'అలాకాదు ఇలా' అని ఎలా మన పొరపాట్లని సరిదిద్దుతారో, అలాగే ఈ హాస్టల్‌లో మనమేదైనా పొరపాటు చేస్తే ఈ ఫాదర్స్ కరెక్టుచేస్తారు" వరండాలో కాక గార్డెన్‌మధ్యగా నడుస్తూ అన్నాడు లక్ష్మణ్.

"అవునవును" అంటూ అనుసరించాడు వెంకటపతి.

అంతలో పైనుంచి బకెట్ నీళ్ళు వచ్చి దబేలు మని ఇద్దరిమీదా పడ్డాయి. హఠాత్తుగా నీళ్ళువచ్చి మీదపడే సరికి "కెవ్వు"మని కేకవేస్తూ ఎగిరి గంతేశారిద్దరూ వారిద్దరి దుస్తులూ తడిసిపోయాయి.

కోపంగా పైకి చూసారు.

టవల్ మాత్రమే చుట్టుకొని బకెట్ పట్టుకొని నిల బడున్న ఆకారం ఒకటి మూడవ అంతస్తులో నిలబడివుంది.

మాసిన గడ్డం, కళ్ళజోడు వున్న తలని ముందుకు పెట్టి, "సారీ జంటిల్ మెన్! ఐ డిడ్ ఇంట్ ఎక్స్‌పెక్ట్స్ యు ఇన్ ది గార్డెన్ బై ది బై టైమ్" అన్నాడు.

దుస్తులన్నీ తోప తోప కావడంతో. మూడవ నేత్రం తెరచి మన్మధుని భస్మం చేసిన శివునిలా చూస్తున్న వాళ్ళల్లా చెంచులక్ష్మిని చూసిన నరసింహస్వామిలా చల్లబడ్డారు.

"లక్ష్మణ్! పాపం అంత పెద్దమనిషి ఇంగ్లీషులో ఇంతగా బాధపడిపోతున్నాడు వదిలేద్దాంరా" అన్నాడు వెంకటపతి.

"నేనూ అదే అనుకుంటున్నానురా" అన్నాడు లక్ష్మణ్.

ఆ విధంగా రూమ్ మేట్స్ అయిన వారిద్దరూ స్నేహితులు కావడమేకాక. రా అంటే 'రా' అనే స్థితికి వచ్చారు.

గదికి వెళ్ళి దుస్తులు మార్చుకున్నారు. కాని తర్వాత ఏం చేయాలి? అన్నది ఏ ఒక్కరికీ అర్ధంకాలేదు. అలాగే మౌనంగా కూర్చున్నారు.

అలా మౌనంగా కూర్చున్న వెంకటపతి, లక్ష్మణ్ చేతి బొటనవ్రేలు నోట్లో పెట్టుకొని వుండటం గమనించాడు.

"అదేమిటి పసిపిల్లవాడిలా వేలు చీకుతున్నావ్" అనడిగాడు.

వెంటనే వేలు నోట్లోనుంచి తీసి ఆడపిల్లలా సిగ్గుతో మెలికలు తిరిగిపోసాగాడు లక్ష్మణ్. కాని వెంకటపతి పట్టు విడువని విక్రమార్కునిలా ఆ విషయాన్ని వదిలిపెట్టలేదు.

"మా ఇంట్లో నేనే ఆఖరివాడ్ని. అయిదో ఏట వచ్చేవరకు పాలు తాగుతూ వుండేవాడ్నట. ఆ అలవాటు మాన్పించాలని మా అమ్మ ఈ అలవాటుచేసింది" అని "ఎవరితో చెప్పకేం" ప్రతిమాలుతున్నట్లుగా అడిగాడు లక్ష్మణ్.

కాని వెంకటపతి మాత్రం వెక్కి వెక్కి ఏడ్వసాగాడు,

విషయం ఏమిటో అర్థంగాక, "వెంకట్, వెంకట్ ఎందుకు ఏడుస్తున్నావ్" అనడిగాడు.

"మా అమ్మగుర్తుకొచ్చిందిరా" అని "అరె లక్ష్మణ్ నీవు ఎంత అదృష్టవంతుడివిరా, సంవత్సరం, రెండు పంవ

త్సరాలు కాదు, అయిదు సంవత్సరాలు పాలు త్రాగావు. కాని నేను పుట్టిన మూణ్ణెల్లకే తల్లిలేనివాడ్ని అయ్యాను" అంటూ ఏడ్వసాగాడు.

"నీకు అమ్మలేదా!"

"లేదురా, నేను పుట్టిన మూణ్ణెల్లకి అమ్మా-నాన్న అమ్మమ్మ దగ్గర వొదిలి భద్రాచలం వెళ్ళారట. అంతే! పడవమునిగి చచ్చిపోయారురా" అని వెంకటపతి ఏడుస్తుండడంతో ఏం చేయాలో తోచక తానూ స్నేహితునికి సాను భూతిగా ఏడ్వటం ప్రారంభించాడు లక్ష్మణ్.

రూమ్‌మేట్స్ ఇద్దరూ అలా ఎదురెదురుగా, తీరిగ్గా నడిమంచాన కూర్చుని ఏడుస్తుండటంతో, వరండాలో తిరుగుతున్నవారు ప్రక్కగదిలో వాళ్ళు పరుగు పరుగున పోయి వార్డెనుకి తెలియజేశారు.

విషయం విన్న ఫాదర్ అరకాల్ పరుగులాంటి నడకతో నూటపదకొండు నంబరుగల రూముకి చేరు కున్నాడు

పరిసరాల్నే మర్చిపోయి, పోటీపడినట్టుగాఏడుస్తూ కూర్చున్న వాళ్ళు "ఏయ్ వెంకటపతీ! లక్ష్మణ్" అని ఫాదర్ అరకాల్ తట్టిపిలవడంతో ఈ లోకంలోకివచ్చారు. ఎదురుగా వున్న ఫాదర్ని, గుమ్మానికి దడికట్టినట్టుగావున్న విద్యార్థుల్ని చూడగానే వారి గుండెలు దడదడ లాడేయి. "ఫాదర్" అంటూ ఇద్దరూ ఒకేసారి లేచి కూర్చున్నారు.

"ఏమైంది, ఎందుకిలా ఏడుస్తున్నారు" అనడిగాడు.

ఫాదర్ ఆ ప్రశ్న అడిగేసరికి వాళ్ళకాళ్ళు వణక సాగాయి.

"అసలు విషయం చెపితే, దున్నపోతుల్లా పీకల వరకుమెక్కి నడిమంచాన తన్నిపెట్టుకొని తీరిగ్గా కూర్చొని అరిగేదాకా ఏడుస్తున్నారా' అని కొప్పడతాడేమోనన్న ఆలో

చన వచ్చింది. ఆ ఆలోచన వచ్చిందే తడవుగా మళ్ళీ ఏడుపు పెల్లుబికింది.

"అరె ఏడ్వకండి...ప్లీజ్ డోంట్ వీప్" అంటూ లాలనగా వారి వీపుమీద తట్టసాగాడు అరకాల్.

వారిద్దరిలో ముందుగా ఏడుపునుంచి తేరుకున్న లక్ష్మణ్ కి మెరుపులాంటి ఆలోచన వచ్చింది." ఫాదర్ భోజనం చేసి వచ్చిన తరువాత వెంకటపతి పడుకున్నాడు. ఆ నిద్రలో నన్ను ఒక రాక్షసుడు చంపివేసినట్లు కల వచ్చిందంట."

"ఏం చెప్తాడా" అని శ్రద్ధగా వింటున్న వెంకటపతి 'ఈ కథా బాగానే వుందే' అనుకున్నాడు.

"ఓ మై లార్డ్" అంటూ ఫాదర్ అరకాల్ క్రాస్ చేసుకొని "మిమ్మల్ని శాటన్ ఇన్ ఫ్లుమెన్స్ చేయాలని చూస్తున్నాడు. ఆ ప్రభువు వున్నంత కాలం మీరేం భయ పడవలసిన అవసరంలేదు. సాయంత్రం కబురు చేస్తాను. నాతోపాటు చ ి కి రండి" అన్నాడు.

"అలాగే ఫాదర్" ముక్త కంఠంతో అన్నారు.

"గ్లాడ్ మె బ్లెస్ యు" అంటూ అరకాల్ వెళ్ళి పోవడంతో, మిగతావాళ్ళుకూడ వెళ్ళిపోయారు.

తలుపు గడియపెట్టి, "లక్ష్మణ్! బుర్రంటే నీదేరా అంతలోనే ఎంత చక్కగా కథఅల్లి చెప్పావురా" ఆప్యాయతతో ఆలింగనం చేసుకున్నాడు.

ఆ క్షణ నుంచి లక్ష్మణ్ బుద్ధిశాలి! అన్న అభిప్రాయం గాఢంగా నాటుకుపోయింది వెంకటపతి హృదయంలో.

కాని, ఈ సంఘటన నంబరు నూట పదకొండు గదిలోనని ఆ హాస్టల్ లో అందరికీ తెలిసిపోయింది. హాస్టల్ లో చేరిన ఆరు నెల్లలకుగాని ఒకరికొకరు చొప్పున

అందరికీ పరిచయంకారు. కాని వెంకటపతి – లక్ష్మణ్ మాత్రం ఇరవై నాలుగ్గంటలలో అందరికీ తెలిసిపోయారు.

హాస్టల్ బెల్ మ్రోగడంతో అంతా కాలేజీకి బయలు దేరడం గమనించిన లక్ష్మణ్ "వెంకట్ అంతా కాలేజీకి వెళ్తున్నారు. మనము వెళ్ళాలిగా" అన్నాడు.

"అప్పుడే వెళ్తున్నారా" అంటూ బయటకు తొంగి చూసి "లక్ష్మణ్ అంతా ఇన్‌షర్టు చేసుకొని వెళ్ళుచున్నారు ఈ కాలేజీలో అది రూల్ కాబోలు" అన్నాడు.

కాలేజీకి వెళ్ళిన తర్వాత ఇన్‌షర్టు చేసుకోవాలని. కళ్ళజోడు పెట్టుకోవాలని కలలు కనేవాడులక్ష్మణ్. అయితే మనమూ ఇన్‌షర్టు చేసుకుందాం" అని ఉబాలాటపడ్డాడు.

"అలాగే" అని పంట్లాంలోకి షర్టుబోపాడు. కాని పంట్లాం చాల వదులుగా వుంది. 'ఇలాకాదు' అనుకుంటూ లోపలున్న మొలత్రాడు బైటకులాగి పంట్లాంమీద వేశాడు.

అప్పటికి లక్ష్మణ్ కూడ టక్‌చేసుకోవడం పూర్తి అయ్యింది. లొటాలొటా పంట్లాంమీద వేసిన మొలత్రాడు చూసి "గురూ! మొలత్రాడు పైకి కనిపిస్తే బాగుండలేదు" అన్నాడు లక్ష్మణ్.

"నాకు బెల్టులేదు. ఏంచేయను?" కొళ్ళను మార్కు ముఖం పెట్టాడు.

"అయితే ఇన్‌షర్ట్ తీసెయ్‌బాగుండలేదు" అన్నాడు.

అయిష్టంగానే ఇన్‌షర్ట్ తీసివేశాడు వెంకటపతి.

ఇంతలో పుణ్యకాలం కాస్తా పూర్తియింది. కాలేజీ బెల్ మ్రోగింది.

"మళ్ళీ ఏదో బెల్ మ్రోగింది త్వరగా వెళ్దాంపద" అంటూ వెంకటపతిని తొందర పెట్టాడు.

డోర్‌లాక్‌చేసి కాలేజీ వైపు బయలుదేరారు.

కాని అప్పటికే కాలేజీ ఆవరణఅంతానిర్మానుష్యంగా వుంది. ఏవైపునుంచీ శబ్దం వినరావడంలేదు.

"లక్ష్మణ్! మనుషులున్న జాడగాని, మాటలుగాని వినిపించడం లేదు.

అసలీవేళ కాలేజీ వుందా?" అనుమానం వచ్చింది వెంకటపతికి.

అటూ ఇటూ పరీక్షగా చూసి "అదిగో ఆ క్లాసు రూముల్లో స్టూడెంట్స్ వున్నారు" అన్నాడు.

"సరే క్లాసుకి వెళ్దాం పద" అన్నాడు.

మూడంతస్తుల బిల్డింగులు రెండువున్నాయి. వాటిలో తమగది ఎక్కడుందో ఎలా వెతకడం? అనుకున్నాడు లక్ష్మణ్. అనుకోవడమేకాదు వెంకటపతితో అదేమాట అన్నాడు "నిజమే! ఇప్పుడు మన క్లాస్‌రూమ్ ఏదో ఎలా వెతకడం?" అనుకున్నాడు. అంతలో తెల్లని గౌను ధరించి మాసిన గడ్డంతో వస్తున్న వ్యక్తినిచూసి, "లక్ష్మణ్? ఎవరో ఫాదర్ వస్తున్నాడు" అన్నాడు వెంకటపతి

"గుడ్ మార్నింగ్ చెబుదామా?"

"అలాగే .."

ఫాదర్ దగ్గరకురాగానే "గుడ్ మార్నింగ్" అని ముక్తకంఠంతో అన్నారు.

"గుడ్ మార్నింగ్, ఏమిటి ఇక్కడ నిల్చున్నారు?"

"ఈవాళ్ళే కాలేజికివచ్చాం. మా క్లాస్‌రూమెక్కడో తెలియడంలేదు."

"కాలేజి ఫీజు చెల్లించిన రశీదు వుందా?"

చూపించారు.

"ఇప్పుడు మీకు చెప్పినా అర్థం గాదు" అని దగ్గర్లో వున్న ఫిజిక్స్‌లాబ్ అటెండరుని పిలిచి 'ఫలానా గది చూపించు' అని పనిపురమాయించాడు ఫాదర్-

"అలాగే ఫాదర్" అంటూ వెనుదిరిగి, వాడివి అనుసరించారు. 'హలో' అన్న ఫాదర్ మాట వివిపించి వెనుతిరిగి చూసారు.

'ఇలారండి' వెనుకకు పిలిచాడు.

దగ్గరకువెళ్లి చేతులు కట్టుకొని నిలబడ్డారు.

'ముందా చేతులు తీసేయండి'

చేతులు తీసేసారు.

'కాలేజీకి వచ్చారు ఎవరితోనైనా మాట్లాడేటప్పుడు హుందాగా నిలబడి మాట్లాడాలి అలా చేతులు కట్టుకోరాదు'

'అలాగే' అన్నట్లుగా తలూపారు.

'మీ పేరు'

"వెంకటపతి"

"లక్ష్మణరావు" పరిచయం చేసుకున్నారు.

"గుడ్...అని" ఎవరైనా ఏదైనా హెల్ప్‌చేస్తే ధ్యాంక్స్ అని చెప్పాలి మౌనంగా వెళ్ళకూడదు" అన్నాడు.

"అలాగే ఫాదర్" మళ్ళీ మొదటి కొచ్చాడు వెంకటపతి.

"అదికాదు ధ్యాంక్సు చెప్పాలి"

"ధ్యాంక్సు ఫాదర్" కోరస్‌గాచెప్పి బయలుదేరారు.

"ఆయనెవరు" అడిగాడు లక్ష్మణ్.

"వైస్ ప్రిన్సిపాల్ ఫాదర్ కడవిల్...బెల్ కొట్టిన తర్వాత ఎవరూ కాంపౌండులో కనిపించగూడదు. ఆలస్యంగా వస్తే ఆయన పర్మిషన్ స్లిప్ ఇస్తేనే లెక్చరర్లు క్లాసులోకి రానిస్తారు. లేకుంటే రానివ్వరు. ఈయన కూడా రెండుసార్లు చూసి మూడవసారి ఫైన్ వేస్తారు" మిత్రద్వయానికి గుండెలు దడదడ లాడాయి.

"ఈవేళే మేము కాలేజీకి వస్తున్నాం. క్లాసు రూము ఎక్కడో మాకు తెలియదు అందుకే లేటయింది" తాను

మాట్లాడుతున్నది అటెండరుతో అన్న విషయమే మర్చిపోయి సంజాయిషీ చెప్పాడు వెంకటపతి.

"సరే రేపట్నుంచి టైమికి రండి" అని, "అదిగో ఆ కనిపించేదే మీ క్లాసు గది" అంటూ ఆ గది దగ్గరకు తీసుకొని వెళ్ళాడు."

ప్రశ్నార్థకంగా చూసిన లెక్చరర్‌కి "వైస్ ప్రిన్సిపాల్‌గారు మీతో చెప్పమన్నారండి" అని వినయంగా సమాధానం ఇచ్చాడు.

"సరే వెళ్లు" అనగానే అటెండరు వెళ్ళాడు.

లొటలొటా పంట్లంతో, నల్లగా బొద్దుగా వున్న వెంకటపతి ద్వారంలోనే నిల్చున్నాడు. కాని లొటలొటా పంట్లాం తాలూకు కొసలు మాత్రం గది మధ్యకు చొచ్చుకుని వచ్చాయి. ఆ వింత ఆకారానికి వెనుక పీలగా పసిదనం తొణికిసలాడే ముఖంలో ఏ ఏడవ తరగతో చదువుతుంటాడు అనిపించే బుల్లి ఆకృతిని చూసి లెక్చరర్‌కి నవ్వొచ్చింది. కాని బలవంతాన నవ్వాపుకున్నాడు.

"కమిన్" అన్నాడు.

లోపలికి నడిచారు.

"మీ పేరేమిటి"

"వెంకటపతి"

"లక్ష్మణరావు"

సమాధాన మిచ్చారు. మౌనంగా వెళ్ళి చివరి బెంచీలో కూర్చున్నారు.

"మీ రోల్ నంబరు ఎంత?" అటెండెన్సు రిజిస్టరు తెరుస్తూ అడిగారు.

"నూట పదకొండు" కూర్చునే సమాధానం చెప్పాడు వెంకటపతి. "మిస్టర్ నూట పదకొండు స్టాండప్" అనగానే పతి దడాలునలేచి నిలబడ్డాడు.

"సమాధానం చెప్పేటప్పుడు లేచి నిలబడి చెప్పాలి గుర్తుంచుకో"

"యస్ ఫాదర్"

"వాట్ నన్ను ఫాదర్ని చేసాశావా!" అని ఆయన అనగానే క్లాసంతా ఫక్కున నవ్వారు.

బిక్క చచ్చిపోయాడు.

"ప్లీజ్ బి సీటెడ్" అనగానే కూర్చున్నాడు.

తర్వాత లక్ష్మణ్ తన నంబరు చెప్పాడు.

"రేపట్నుంచి మీ నంబర్లు ప్రకారం కూర్చోవాలి. మిమ్మల్ని పేర్లలో గాక నంబర్లతో పిలవడం జరుగుతుంది" అంటూ క్లాసులో ఎలా మెలగవలసింది చెప్పారు. అంతలో బెల్ మోగింది - లెక్చరర్ వెళ్ళిపోయాడు. అప్పుడుగాని లక్ష్మణ్ గాక మరో వ్యక్తి తన ప్రక్క నున్నాడని గమనించలేదు వెంకటపతి.

పొట్లకాయలా సన్నగా, పొడవుగా వున్న ఆ వ్యక్తి వైపు, చూస్తూ పలకరింపుగా నవ్వాడు పతి.

జీవితంలో సర్వసం కోల్పోయిన వాడిలా దిగాలుగా కూర్చునున్న ఆవ్యక్తిముఖంలో సమాధానంగా నవ్వుతొంగి చూడలేదు.

''నాపేరు వెంకట్'' తిరిగి అన్నాడు.

"నాపేరు రఘు'' అని ''మీరు హాస్టల్ లో వుంటున్నారా" అడిగాడు.

"అవును" అని "వీడు నా ఫ్రెండు-రూమ్ మేట్ లక్ష్మణ్" పరిచయం చేసాడు.

"వెరీ గ్లాడ్ టు సి యు" షేక్ హ్యాండు యిచ్చాడు లక్ష్మణ్. "ఇప్పుడు ఏ క్లాసు" తిరిగి అడిగాడు.

"బోటనీ_భగత్ సింగ్ గారు వస్తారు" సమాధాన మిచ్చాడు రఘు.

'సింగ్' అనగానే తలకి టర్బన్ చుట్టుకున్న సర్దార్‌జీ జ్ఞాపకము వచ్చి 'ఈ కాలేజీలో రకరకాల లెక్చరర్‌లు వుంటారు కాబోలు' అనుకున్నాడు లక్ష్మణ్.

పచ్చటర్బన్, తమాషాగా కట్టిన గడ్డం, నల్లకళ్ళ జోడుతో సింగ్ రూపాన్ని ఊహిస్తున్న లక్ష్మణ్ తన ప్రక్క వారు నిలబడటం గమనించలేదు.

వారంతా కూర్చున్నప్పుడుగాని, ఒకఆజానుబాహుడు లెక్చరర్ ప్లాట్‌ఫారమ్ మీద నిలబడున్నాడని గుర్తించలేదు.

"మిస్టర్ యు స్టాండప్" అని అతడు తనవైపే వ్రేలు చూపించడంతో లేచి నిల్చొన్నాడు.

కాని లక్ష్మణ్ నిల్చున్నా, బెంచీమీదకూర్చున్నట్లేవుంది.

"యు మిష్టర్ ఐ సీ యు స్టండప్" అని బిగ్గరగా కేక వేయడంతో లక్ష్మణ్‌కి కాళ్ళు వణికాయి.

అతికష్టం మీద కంఠం పెగుల్చుకొని "నిల్చునే వుండానండీ" అంటూ చెయ్యి ఎత్తాడు.

క్షణం క్రితం వరకు కోపంగా వున్న ఆయన ముఖంలో చిరునవ్వు తొంగిచూసింది.

'మనిషిని చూడబోతే మూడుజానలు లేవు. వెనక కూర్చోబోతే ముందు కూర్చోరాదు," అని "వచ్చి ఈ ఫస్ట్ బెంచీలో కూర్చో" అన్నాడు.

"వీడెవడ్రా, సింగుగారి క్లాసులోకి టింగురంగా అంటూ రావటమేగాగ పైగా నానామాటలు అంటున్నాడు" అనుకుంటూ వెళ్ళి ముందుబెంచీలో కూర్చున్నాడు.

ఆయన అటెండన్స్ తీసుకోవడం ప్రారంభించారు.

"ఇది సింగుగారి క్లాసుకాదా?" లోస్వరంలో ప్రక్కనున్న వాడ్ని అడిగాడు లక్ష్మణ్.

"ఈయనే సింగుగారంటే!"

"అయ్యో, సింగుగారంటే పంజాబీ అనుకుంటున్నా"

"ఈయన తెలుగువారే, కె. భగత్‌సింగ్ అంటే కాట్రగడ్డ భగత్‌సింగ్ ఆయన పూర్తిపేరు".

అటెండెన్సు తీసుకోవటం ఆపివేసి. ఆయన తమ వంకే చూస్తున్నాడని - ఆయన అలా పరీక్షగా తమవైపే చూస్తుండటంలో, స్టూడెంట్సులంతా తమవైపే చూస్తున్నారని వారిద్దరూ గమనించలేదు.

"ఆపేశావేం, కానివ్వండి'' అన్నమాటలు వినిపించటం, ఆ వెంటనే తోటివారంతా ఫక్కున నవ్వటం వినిపించడంతో మతిపోయినవారిలా కంగారుగా నలువైపులా చూశారు.

"యు లిటిల్ రేట్, స్టాండప్" అనగానే స్ప్రింగు యాక్షనిచ్చినట్లు లేచి నిల్చున్నాడు.

"క్లాసులోకి వచ్చిన తర్వాత, అదీ లెక్చరరు వచ్చిన తర్వాత, పైపెచ్చు అటెండెన్సు తీసుకుంటున్నప్పుడు ఎవరూ మాట్లాడకూడదు. ఈ తఫా మాట్లాడావంటే ఏం చేస్తానో తెల్సా?" అనడిగాడు.

తెల్లమొహం వేసుకోని, "చెప్పండి" అన్నట్లుగా చూశాడు.

"ఆ కిటికీలోనుంచి బైటకు విసిరేస్తాను జాగ్రత్త" అని "కూర్చో" అన్నారు.

మౌనంగా కూర్చున్నాడు.

ఆ క్లాసు అవగానే వెంకటపతి దగ్గరకు పరిగెత్తాడు లక్ష్మణ్. "అలా భయపడిపోతావేంటి? ఇప్పుడు మనం స్కూలు విద్యార్థులము కాదు. కాలేజీ విద్యార్థులం. రకరకాల జోక్స్ వేస్తుంటారు. స్పోర్టివ్ స్పిరిట్‌తో తీసుకోవాలి" అన్నాడు రఘు.

కొళ్ళను మార్కు మొహాలేసుకొని చూస్తుండిపోయారు వెంకట్, లక్ష్మణ్.

లంచ్‌కి వెళ్తూ తమ గదికి రమ్మని రఘుని ఆహ్వానించాడు లక్ష్మణ్.

"థ్యాంక్యూ!" అని "ఒక రోజున నాకుగా నేనే వస్తా" అంటూ వెళ్ళిపోయాడు.

"వీడెవడో తమాషాగా వున్నాడే" రఘు వెళ్తున్న వైపే చూస్తూ అన్నాడు వెంకట్.

"వాడు- వీడు అనకు పాపం మంచోడిలా వున్నాడు" అన్నాడు లక్ష్మణ్.

"సరే అతన్ని కూడ మనలో చేర్చుకుందామా"

"ఓ యస్"

ఇహ మాట్లాడటానికి వారికి మాటలే దొరకలేదు. హాస్టల్ చేరుకున్నారు రూమ్‌లోకి వెళ్ళి మగ్‌లు తీసుకొని మెస్‌వైపు బయలుదేరారు. ఎవరో ఒకరూ, ఇద్దరూ తప్పిస్తే ఎవరూ ఒంటరిగా వెళ్ళడంలేదు. అంతా జట్లు జట్లుగా వెళ్తున్నారు. తనకిగూడా ఒక ఫ్రెండుఅంటూ దొరికినందుకు పైగా తాను చెప్పేది అబ్బురంగా వినే వ్యక్తి దొరికినందుకు వెంకటపతికి చాలా సంతోషంగా వుంది. ఆ సంతోషంలో వస్తున్న వెంకటపతికి హఠాత్తుగా నాలుగు తెల్లగౌనులు కనిపించాయి.

లక్ష్మణ్ దగ్గర తన పెద్దరికాన్ని నిలబెట్టుకోవటానికి ఇదే మంచి సమయం అనుకొని, "గుడ్ ఆఫ్టర్నూన్ ఫాదర్స్" అన్నాడు.

తెల్లగౌను వేసుకున్న వారు నలుగురూ ఒకరివంక మరొకరు చూసుకుంటూ నవ్వుకొని వెళ్ళిపోయారుగాని, వెంకటపతిని తిరిగి విష్ చేయలేదు.

అందుకు బాధపడినా, లక్ష్మణ్ దగ్గర- అదీ తనకంటే చిన్నవాడయిన రూమ్‌మేట్ దగ్గర బయటపడదల్చుకోలేదు. అందుకే వెర్రినవ్వొకటి నవ్వి "చూడలేదు" అన్నాడు.

కాని, "వెంకటపతి" అన్న కేక వినిపించిన వైపు చూశాడు.

ఫ్రెంచి మీసాలుతో, కళ్ళజోడు ధరించి వున్న మెస్ లీడరు నిలబడున్నాడు. "నమస్తే" అంటూ దగ్గరకు వెళ్ళి, వీడు మా రూమేట్ లక్ష్మణ్. ఈయన మన మెస్ లీడరు గన్నారావుగారు'' అని పరిచయం చేసి మరోసారి తన ప్రెస్టేజీని నిలబెట్టుకో జూశాడు పతి.

"నా పేరు గున్నారావుకాదు పున్నారావు" ఈ హఠాత్పరిణామానికి తెల్లబోయాడు పతి.

''ఇందాకా ఎవరికి విష్ చేస్తున్నావ్?" ఆషాక్ నుంచి తేరుకోక పూర్వమే మరొక ప్రశ్నవేశాడు.

సమాధానం ఇచ్చే స్థితిలో లేడు.

"మిస్టర్ పతి!" అంటూ చొరవగా భుజం మీద చేయివేసి. "తెల్లగౌను వేసుకున్న వాడల్లా ఫాదర్ కాదు. అనవసరంగా విష్‌చేసి వాళ్ళనిఅందలాలెక్కించకు"అన్నాడు.

'అలాగే' అన్నట్లుగా తలూపాడు.

"త్వరగా వెళ్ళు...ఆలస్యం అయితే సీట్లుదొరకవు" అన్నాడు పున్నారావు. మారు మాట్లాడకుండా మెస్ వైపు దారితీశాడు. వెంకటపతి అతడి మనసు కుతకుతలాడి పోతుంది. ఫాదర్స్ అని విష్ చేసినా వారు రెస్పాన్స్ ఇవ్వనందుకు కాదు బాధ, పున్నారావు కోప్పడినందుకు అదీ లక్ష్మణ్ ఎదుట!

"ఎంతయినా నీవు అదృష్టవంతుడివిగురూ"అన్నాడు లక్ష్మణ్. పున్నారావు కోప్పడ్డాడని తాను బాధపడ్తుంటే, వీడు గొప్పోడంటున్నాడు ఖర్మజాలక వీడిలా తిట్టడంలేదుకదా" అన్నట్టుగా చూశాడు.

"నిజం గురూ ఎక్కడున్నించో వస్తాం. అంతా కొత్త వాతావరణం. ఈస్థితిలో మనంచేసే పొరపాట్లని

కరెక్టుచేసి సరైనమార్గంలో నడిపే పెద్దదిక్కు దొరకడం ఎంత అదృష్టం?"

లక్ష్మణ్ మాటలు మంత్రజలంలా పనిచేశాయి వెంకటపతిపైన 'నిజమే' అనుకున్నాడు. ఆ ఆలోచన వచ్చిందే తడవుగా వెంకటపతి ఛాతి ఆనందంతో ఉప్పొంగింది. సంతోషంతో కడుపునిండిపోవడంతో సరిగాభోజనమే చేయలేకపోయాడు.

కాని, ఉదయం ఆలస్యంగా వెళ్ళినందుకు వైస్ ప్రిన్సిపాల్ అబెండరునిచ్చి పంపిన విషయం గుర్తుకువచ్చి తడి ఆరకమునుపే కాలేజీకి బయలుదేరారు.

కాలేజీలో ఎంతో శుభ్రంగా, వెడల్పుగావున్న రోడ్లని చూడగానే తమఊళ్ళోని రోడ్లు గుర్తుకొచ్చాయి లక్ష్మణ్ కి.

"వర్షాకాలం వస్తే చాలు మోకాలులోతు బురద పేరుకుపోతుంది. ఎగుడు, దిగుడు రోడ్లు పేరుకిమాత్రం కంకరరోడ్లుగాని, మట్టిరోడ్లకన్నా మహాదారుణం' – ఈ తరహా ఆలోచనలలో మునిగిపోయివున్న లక్ష్మణ్ హఠాత్తుగా, డొక్కలో గుద్దినట్టుంటే ఎగిరిపడ్డాడు. మోచేత్తో పొడిచి "అటు చూడు" లోస్వరంతో అంటూ చూపించాడు. ఒక చెట్టుక్రింద పది, పన్నెండుమంది కూర్చునున్నారు. దుస్తులెక్కడ మాసిపోతాయోనని పుస్తకాలమీద కూర్చున్నారు. "అయ్యో! పుస్తకాలు సాక్షాత్తు సరస్వతీదేవి! అటువంటి పుస్తకాలమీద కూర్చున్నారే?" అన్నాడు లక్ష్మణ్. "ష్" అని వారించి. "మెల్లగా... వింటారు" అన్నాడు.

"మాట్లాడరులే" అని నోరు మూసుకున్నాడు.

కాలేజి బిల్డింగ్సు చేరుకున్నారు.

కాని ఈవెనింగు ఫస్టు అవర్ ఏమిటో, రూము ఎక్కడో వారికి అర్థం కాలేదు ఉదయమే అడిగి తెలుసుకోనందుకు తమనితాము తిట్టుకున్నారు.

ఇప్పుడు ఎలా అంటూ మెట్లమీదే చతికిలబడ్డాడు వెంకటపతి.

"గురూ! ఇక్కడే కూర్చుంటే మన క్లాసులో వారు ఎవరో ఒకరు కనిపించకపోరు"

"కాని వాళ్ళని మనం గుర్తించగలమా?"

"మనం గుర్తించకపోతే, వాళ్ళే మనని గుర్తించవచ్చుగా!" "అదీ నిజమే!"

కాలం గడచిపోతోంది. స్టూడెంట్స్ అటూ ఇటూ తిరుగుతున్నారు. గూడెంలో తయారుచేసిన చెప్పులతో, లొటలొటా ఫాంట్లతో, భుజాలమీదకు పడుతున్న జుట్టుతో నల్లమొద్దులా వున్న వెంకటపతిని, సన్నగా, పీలగా, గుండుతో కళ్ళను మారు_లావున్న లక్ష్మణరావుని చూసి 'మొద్దబ్బాయి_బుల్లబ్బాయి' భలే కాంబినేషన్! అనుకుంటూ ఎవరికి వారు నవ్వుకుంటూ వెళ్ళిపోతున్నారేకాని, పలకరించిన నాథుడే లేడు

కాలం గడుస్తున్నకొద్దీ స్టూడెంట్స్ పెరగసాగారు. ఏం చేయాలో తోచక లక్ష్మణ్ జుట్టు పీక్కోబోయాడుగాని, ఆ జుట్టు పదవ క్లాసు పాసయినందుకు మొక్కుబడిగా దేవుడికిచ్చిన విషయం గుర్తుకొచ్చి ఆ ప్రయత్నం అర్ధంతరంగా మానేసాడు.

అంతలో సైకిల్ స్టాండు వేపు నుంచి వస్తున్న పొట్లకాయలాంటి ఆకారాన్ని చూడగానే లక్ష్మణ్ కళ్ళు వింత కాంతితో మెరిశాయి. సదరు పొట్లకాయలాంటి శరీరానికి అధిపతి రఘు. టక్ చేసుకొనివస్తున్న అతడు నల్లకళ్ళజోడు పెట్టడం వల్ల వెంటనే గుర్తించలేకపోయారుగాని, గుర్తించిన వెంటనే "నమస్కారం బ్రదర్" అన్నాడు వెంకటపతి.

"నమస్కారం" అని "ఏమిటిలా మెట్లమీద కూర్చున్నారు" అడిగాడు.

"క్లాసు రూమెక్కడో తెలియక అని చెప్పడానికి అభిమానం అడ్డువచ్చి "నీ కోసమే" అన్నాడు లక్ష్మణ్.

"భలే వారేరండి" అంటూ మూడో అంతస్తుకి తీసు కెళ్ళాడు. మూడో అంతస్తులోని పిట్టగోడ దగ్గర నిల్చొని క్రిందకు చూసిన వెంకటపతికి పిట్టల్లా కాంపౌండులో కని పిస్తున్న వార్ని చూడగానే తనెంతో ఎత్తు ఎదిగినట్టు ఫీల య్యాడు అంతఎత్తు బిల్డింగులో చదువుతున్నందుకు గర్వం లాంటి భావం అతడి మనసులో తొంగి చూసింది.

"ఈ కాలేజి చూస్తే బామ్మ ఎంత సంతోషిస్తుందో" అనుకున్నాడు మరుక్షణమే "వలివేరు"లోని స్నేహితులు గుర్తుకొచ్చారు. పిచ్చివెధవలు కాలేజీ అంటే వాళ్ళని హైస్కూలులా రేకుల షెడ్డులనుకుంటున్నారు. రేపు ఇంటి కెళ్ళినప్పుడుగాని వాళ్ళకి మా కాలేజీ గురించి చెబుతుంటే కళ్ళు తిరిగి పడిపోరు అని పరి పరి విధాల ఆలోచ లలో మునిగి పోయాడు వెంకటపతి

కాని. అంతా క్లాసు రూముల్లో పుస్తకాలుపెట్టి వచ్చి వరండాలో తిరుగుతుంటే రఘు తమని పుస్తకాలతో వరం డాలోనే ఎందుకు నిలబెట్టాడో లక్ష్మణ్ కి అర్థం కాలేదు.

"ఇదిగో తీసికెళ్తాడు, అదిగో తీసికెల్తాడు" అని ఆశగా ఎదురుచూసిన వాడల్లా రఘు ఎంతసేపటికి క్లాసు రూమువైపు నడవకపోవడంతో "మన క్లాసు ఎక్కడ" అనడిగాడు.

"ఈ పూట జువాలజీ ప్రాక్టికల్స్ ఫస్టుబెల్ మ్రోగితే గాని తలుపులు తెరవరు. మరో పావుగంట వరకు మనము వరండాలోనే వుండాలి" "ఉదయం టైమ్ టేబుల్ వ్రాసుకో వడం మర్చిపోయాను ఇవ్వు" చొరవగా అడిగాడు లక్ష్మణ్.

ఇచ్చాడు రఘు.

పావుగంటసేపు వారలా కాలక్షేపం చేసారు.

ఫస్ట్‌బెల్ మ్రోగింది. లాబ్ తలుపులు తెరుచుకున్నాయి.

సినిమా విడుదలయిన మొదటిరోజున మొదటి ఆట చూడటానికి క్యూలో నిల్చున్న మొదటి వ్యక్తి కౌంటర్ తెరవగానే టికెట్ కోసం చెయ్యి ఎలాచాపుతాడో అలాగే లాబ్‌లోకి అడుగుపెట్టాడు వెంకటపతి.

నోరుతెరచి, గాండ్రిస్తున్నట్లున్న పెద్దపులి తలకాయి ఎదురుగావున్న గోడకి తగిలించివుంది. అప్పుడే మెయిన్ డోర్ మాత్రం తెరచిన అటెండరు మిగతా కిటికీలను తెరిచే ప్రయత్నములో వున్నాడు. చీకటివెలుగులు దోబూచులాడుతున్నట్లుంది హాలులో. పులి కళ్ళని పోలిన మెర్క్యూరీ కళ్ళు, ఆ కాంతికి వింతగా మెరుస్తున్నాయి.

హఠాత్తుగా ఆ స్థితిలోవున్న పులితలని చూసిన వెంకట్ గతుక్కుమన్నాడు. తల ప్రక్కకు త్రిప్పాడు.

దుప్పితల తగిలించి వుంది. ఒళ్ళు జలదరించింది. గిర్రున వెనుకకు తిరిగాడు. పొడవయిన సీసాలలో త్రాచుపాములు వ్రేలాడుతున్నాయి.

భయంతో కెవ్వుమని కేకవేశాడు. కాని తెరచుకున్న నోటునుంచి శబ్దంమాత్రం బయటకురాలేదు. గజగజ వణికిపోసాగాడు. ముఖాన చిరుచెమట్లు చోటుచేసుకున్నాయి.

"వెంకటపతి! ఏమయింది" అంటూ పొదివిపట్టుకొని ఆందోళనగా చూస్తూ అడిగాడు రఘు.

"ప...ప...పాము" తత్తరపడ్డాడు.

అంత పెద్ద శరీరము గజగజ వణికిపోవడం గమనించిన లక్ష్మణ్ పెదవులపై చిరునవ్వుతొంగిచూసింది. కాని నవ్వడానికది సమయం కాదనుకుని అతి కష్టంమీద ఆపుకున్నాడు.

"అవన్నీ చచ్చిన పాములు. ద్రావకంలో వుంచారు" అంటూ తప్పటడుగులు వేస్తున్న పసి పిల్లవాడ్ని నడిపించు కొని వెళ్ళినట్లు మూలనున్న టేబుల్ దగ్గరకు నడిపించు కెళ్ళాడు టేబుల్ ముందు కూర్చున్నాడన్న మాటేగాని వెంకటపతి కాళ్ళు మిషన్ తొక్కుతున్నాయి. టేబుల్‌పై నున్న చేతులు దరువేస్తున్నాయి.

కిటికీ తలుపు వి తెరుస్తున్న అటెండరు ఆ శబ్దానికి వెనుతిరిగి, "బాబూ! ఇది లాబ్ అలాంటి పిచ్చిపనులు చేస్తే ఫైన్ వేస్తారు. జాగ్రత్త" అని హెచ్చరించాడు అటెండరు.

జానెడు లోతు నీళ్ళలో తిరుగుతున్న. చేపని జాలరి పట్టుకున్నట్టు తటాలున వెంకటపతి రెండు చేతుల్నీ పట్టు కున్నాడు రఘు. కాని కాళ్ళు ఆగకపోవడం గమనించిన లక్ష్మణ్, తన రెండు కాళ్ళతో వెంకటపతి కాళ్ళనుక్కమెలిపెట్టి పట్టుకున్నాడు.

ఏమైతేనేం గుండె చేస్తున్న రొదని ఒక్క వెంకట పతి మాత్రం వినగలుతున్నాడు గాని, మిగతావారు మాత్రం నిశ్శబ్ద జగతిలానే వుండిపోయారు అంతలో లాబ్‌లోకి అడుగుపెట్టినవారు, సీరువాలోవున్న పాముల్ని వింతగా చూడటం గమనించి, "చూడు వాళ్ళంతా ఎంత ధైర్యముగా చూస్తున్నారో! మనిషిని చూడబోతే పులిలా దర్జాగావున్నావ్ ఇలా పిరికివాడిలా వణికిపోతావేమిటి" అని అడిగాడు రఘు.

"గురూ! చచ్చిన పాముల్ని చూసి ఇలా వణికి పోతున్నావ్. రేపు డాక్టరు కావడానికి శవాల్నెలా కోస్తావ్" మెడిసన్‌లోకి ప్రవేశించినట్టే అడిగాడు లక్ష్మణ్.

అతడి మాటలు కోపం తెప్పించినా, సమాధానం చెప్పే స్థితిలో లేడు. వెంకటపతి. హృదయం ఇంకా వేగంగా కొట్టుకుంటూనే వుంది. అంతలో రెండవ బెల్ మ్రోగింది.

పొట్టిగా, ఎర్రగావున్న వ్యక్తి లాబ్‌లోకి ప్రవేశించాడు.

పొట్టి ప్లీడరులా వున్న ఆ వ్యక్తి లెక్చరరా? స్టూడెంటా? అనుమానం వచ్చింది. కాబోలు ఏ ఒక్కరూ లేవలేదు.

టక్ చేసుకొని వున్న అతడి చేతిలో రిజిస్టర్ చూసి, 'లెక్చరర్' అనుకొని బ్లాక్ బోర్డు దగ్గర్లో వున్నవారు లేచి నిలబడ్డారు. దానితో గొర్రెల మందలా మిగతావారంతా లేచి నిల్చున్నారు.

"సిట్ డౌన్" అని అతడు అనగానే అంతా కూర్చున్నారు. అంతలో ఎవరో స్టూల్‌లాగిన శబ్దం వినిపించింది.

"సీ బాయస్, మీరు స్టూల్‌ని అలా లాగగూడదుఅలా చేస్తే చాల డిస్టర్బెన్స్‌గా వుంటుంది. అందు వల్ల ఈతఫా ఎవరైనా స్టూలుని లాగితే ఫైన్ వేస్తాం అన్నాడు. అంతలో మూడవ బెల్ మ్రోగింది.

"ఇప్పుడు జువాలజీ హెడ్ అంబ్రాస్‌గారు వస్తారు విశ్శబ్దంగా కూర్చోండి" తిరిగి అన్నాడు.

"జువాలజీ హెడ్" అంటారు ఆయనొక్కడికే .తల' వుంటుందా, ఏమిటీ అన్న ధర్మసందేహం కలిగింది లక్ష్మణ్‌కి. వెంటనే అదే ప్రశ్నని ప్రక్కనున్న రఘుని అడిగాడు.

"మనకి స్కూలులో హెడ్ మాష్టర్ అనివుంటాడు ఆయనే స్కూలు వ్యవహారాలన్నీ చూసుకునేవాడు. కానీ ఇది కాలేజికదా! అన్ని వ్యవహారాలు ప్రిన్సిపాల్ చూసుకోలేక డిపార్టుమెంటుకొక హెడ్ అపాయింట్ చేస్తారు." అని తెలియజేసిన రఘు అంతటితో తన వుపన్యాసాన్ని ఆపక, "అంబ్రాస్‌గారంటే చాలా గొప్పవాడు. ఆయనకు

చాలా డిగ్రీలు వున్నాయి. జువాలజీలో ఆయనకి తెలియనిది అంటూ లేదట" అని కూడా తెలియజేశాడు.

'గౌణగౌణ'మని విన వస్తున్న ధ్వని ఏవైపునుంచా అని శ్రద్ధగా పరికించిన ఆ పొట్టి ప్లీడరు, "యస్ యు టు స్టండప్" అన్నాడు.

రఘుని, లక్ష్మణ్‌ని వ్రేలితో చూపుతూ.

మరో సమయంలో అయితే ఆ సంభాషణలో వెంకటపతి కూడ పాల్గొని, తన పెద్దరికాన్ని నిలుపుకొనే వాడేమోగాని అంతకు కొద్దినిముషాలు క్రితమే పట్టుకున్న గుండెదడ నుంచి తేరుకునే మూడ్‌లో వుండటం వల్ల ఆ సంభాషణ పట్ల శ్రద్ధ కనబర్చలేదు. రఘు, లక్ష్మణ్ నిల్చున్నారు.

సన్నగా పొట్లకాయలా పొడవుగా వున్న రఘు, నడుం వరకు మాత్రమే వచ్చిన లక్ష్మణ్‌ని చూడగానే పొట్టి ప్లీడరుకి తన కాలేజి రోజులలో అమ్మాయిలు తనని పొట్టిప్లీడరు అని పేరు పెట్టి ఎలా ఏడిపించిందీ గుర్తు కొచ్చింది కాబోలు అప్రయత్నంగా నవ్వేశాడు.

అతడు నవ్వడంతో మిగతా విద్యార్థులుకూడా నవ్వారు.

పొట్లకాయ రఘుకి, కొశ్చను మార్కు లక్ష్మణ్‌కి విషయం అర్థం కాక ముఖాముఖాలు చూసుకున్నారు

"ఏమిటి ఒకరి చెవులొకరు కొరికేసుకుంటున్నారు" నవ్వునుంచి తేరుకుని ప్రశ్నించాడు పొట్టిప్లీడరు.

మెఱుపులాంటి ఆలోచన వచ్చింది రఘుకి

"ఈయన జువాలజీ లెక్చరరా? అని అడిగాడు. అవునన్నాడు. పేరేమిటి అని తిరిగి అడిగాడు తెలియదని చెప్తున్నాడు" అంతలో నల్లగా, లావుగా ఎత్తుగా వున్న ఒకవ్యక్తి చెమటలు క్రక్కుకుంటూ 'దడదడ' మని శబ్దం వేసుకుంటూ లాబ్‌లోకి అడుగుపెట్టాడు.

ఐరావతాన్ని చూడగానే దేవగణాలంతో నమస్కరించి నట్టు క్లాసులోని విద్యార్థులంతా అప్రయత్నంగా లేచి నిల్చున్నారు.

"సిడౌన్" అనగానే అంతా కూర్చున్నారు.

కాని, తాము కూర్చోవాలో నిల్చునేవుండాలో అర్థంగాక అలాగే డోలాయమనంలోపడి, వంగబడి నిల్చున్నారిద్దరూ.

'యు బాయిస్, సిడౌన్' తిరిగి కేకేశాడాయన.

"బాయస్" అంటున్నాడు ఇక్కడ ఇంకా ఎవరైనా గర్ల్సుకూడా వున్నారా! అనుకుంటూ హాలంతా పరీక్షగా చూశాడు లక్ష్మణ్. మచ్చుకి ఒక్క ఆడపిల్లకూడా లేదు. కాని అపర హనుమంతుడిలా ఎంతోభయభక్తులతో చేతులు కట్టుకొని శ్రద్ధగా ఆ సనవంకే చూస్తూ కూర్చునున్నాడు వెంకటపతి, "యస్ గివ్ మి యువర్ అటెండెన్స్ ప్లీజ్" అంటూ నంబర్లు పిలువసాగాడు. ఆయనకాళ్ళకు ధరించిన చెప్పుల్ని, క్రిందమడతపెట్టి వున్న వదులు పంట్లాంని చూడగానే లక్ష్మణ్ కి వెంకటపతి చెప్పులు. పంట్లాం గుర్తొచ్చాయి. వెంటనే మోచేతితో గుమ్మడికాయలా వున్న వెంకటపతి బొజ్జమీద ఒక్కపోటు పొడిచాడు.

"ఏమిట్రా" అన్నట్టు అసహనంగా చూశాడు వెంకటపతి.

"గురూ, నీ చెప్పుల్ని, పంట్లాంని చూస్తుంటే ఏదో ఒకరొజున నీవూ ఆంబ్రాస్‌గారంత గొప్పోడివయిపోతావని నాకు పెద్ద అనుమానంగా వుంది" "చస్ అరవబాకురా! అటెండెన్స్ తీసుకుంటున్నారు" కోప్పడ్డాడు వెంకటపతి. అంతలో చాక్‌పీస్ ఒకటి తగలడంతో ఉలిక్కిపడిచూశాడు.

అసలేం జరిగిందంటే సరిగ్గా అదే సమయంలో ఏవోమాటలు వినిపించడంతో ఆ మాటలు ఎక్కడ్నుంచా అని పరిశీలనగా చూస్తున్న ఆంబ్రాస్‌కి మాట్లాడుతున్న

వెంకటపతి కనిపించాడు. వెంటనే టేబుల్‌మీదున్న చాక్ పీస్ తీసి వెంకటపతికి గురిచూసి విసిరాడు.

"యు స్టాండప్" అనగానే ఎన్.సి.సి. కేండెట్‌లా తటాలున లేచి నిల్చున్నాడు.

"చూడబోతే క్రికెట్ బాలులా నున్నగా గుండ్రంగా వున్నావ్. క్లాసులో, అదీ అటెండెన్సు తీసుకునేప్పుడు. మాట్లాడితే పనిష్‌మెంట్ ఏమిటో తెలుసా?"

తననెందుకు నిలబెటాడో, అలా వన్ వే ట్రాఫిక్‌లో ఎందుకు కోప్పడుతున్నాడో అర్థంగాక తెల్లమొహంవేసుకొని చూస్తుండిపోయాడు.

"ఆ పెదాలు రెండు ముయ్యి. లేకుంటే ఏ దోమలో లోపలికి వెళ్ళి గుడ్లు పెట్టేస్తాయి" అని తిరిగి ఉపాసన అనే వరకు తాను నోరు తెరచి చూస్తున్నాడన [illegible] గుర్తించలేకపోయాడు. వెంటనే నోరు మూశాడు.

"సిడౌన్" అని, "అని, "అటెండెన్సు తీసుకునేటప్పుడు ఎవరైనా మాట్లాడితే ఫైను వేస్తాను. జాగ్రత్త" హెచ్చరించాడు. అటెండెన్సు తీసుకోవడం పూర్తి చేసి. "మీరంతా రేపట్నుంచి ప్రాక్టికల్ రికార్డ్సు, డిసెక్షన్ బాక్సులు తీసుకురావాలి మీలో ఎవరైనా ఏదైనా తీసుకురాకపోతే అర్ధ రూపాయి ఫైన్ కట్టాలి. ఆ ఫైన్ కట్టినట్టు రశీదు తీసుకొని చూపిస్తేనే క్లాసులోనికి రానిస్తాం. లేకుంటే రానివ్వం...." అని, "ఈయన పేరు మూర్తి. డిమాన్‌స్ట్రేటరు, రేపట్నుంచి మీకు ప్రాక్టికల్స్ గైడెన్సు ఇచ్చేది ఈయనే" అంటూ పొట్టి ప్లీడరుని చూపించి "సరే నేను వెళ్ళొస్తాను" అని వెళ్ళిపోయాడు.

అంట్రాస్ వెళ్ళిపోవడంతో గుండెలనిండా గాలి పీల్చుకుని, "మాట్లాడకుండా ఏదైనా పని చూసుకోండి" అని కుర్చీదగ్గరకు లాక్కొని కూర్చున్నాడు మూర్తి.

"గురూ! ఈవేళ పాఠాలు చెప్పిన వంతుల్లకంటే ఫైన్‌లు వేస్తానన్నోళ్ళు ఎక్కువకనబడుతున్నారు. అసలి క్కడ పాఠాలు చెప్తారా? ఫైన్లు వసూలు చేస్తారా? అమాయ కంగా ముఖంపెట్టి రఘుని అడిగాడు లక్ష్మణ్.

"ఇక్కడ మొదట క్రమశిక్షణ, తర్వాత పాఠాలు నేర్పుతారు" అప్పటికి గాని అంబ్రాస్ ఇచ్చిన డోస్ నుంచి తేరుకోలేదు వెంకటపతి.

"మాట్లాడకండి గురూ! ఆయన మన వైపే చూస్తు న్నాడు. ఫైన్ కట్టమంటాడు బావిలోని గొంతులా వినిపిం చింది వెంకటపతి స్వరం.

"ఆ! డిమాన్‌స్ట్రేటర్ గదా" నాన్నాడు లక్ష్మణ్.

"అలా అనకు మనకు రిటిన్ ఎగ్జామ్. డెబ్బై మార్కులకే. మిగతా ముప్పైమార్కులు ప్రాక్టికల్ ఎగ్జామ్ వీళ్ళు తలుచుకుంటే ముప్పైకి ఇరవై ఎనిమిది వేయించ గలరు. అంతా వీళ్ళచేతుల్లోనే వుంది"

"అయితే ఈయనతో మంచిగావుంటేపోలా!"

"మంచిగా వున్నందువల్ల లాభం లేకపోయినాకనీసం నష్టం వుండదు. అందువల్ల ఎదురుపడితే నమస్కారబాణాలు వదిలెయ్" సలహా ఇచ్చాడు రఘు.

"నమస్కారాల దేముంది, ఒకే తఫా రెండు చేతు లతో రెండు నమస్కారాలు విసిరేస్తాను" మాంచి హుషా రుగా సమాధానమిచ్చాడు లక్ష్మణ్.

టేబుల్ పైనున్న కళ్ళజోడు తీసిచూస్తూ "గురూ! నీవు ఎప్పుడు కళ్ళజోడు వాడతావెందుకు?" అప్పటి వరకు శ్రోతగా వున్న రఘుని వెంకటపతి అడిగాడు.

"గుండెలోని విషాదం ఎర్రని జీరలుగా కళ్లలో ప్రతిఫలిస్తుంది. ఆ ఎర్రని జీరలు అందరికీ కనిపించ

గూడదని నల్లకళ్లజోడు పెడతాను" అనంటున్న రఘు స్వరంతో జీర తొంగిచూసింది.

"ఏమిటి గురు తమాషాగా మాట్లాడుతున్నావ్" -

"కొయ్యదుంగల్ని రంపంతో కోస్తే పొట్టుపడుతుంది విషాదం గుండెల్ని పిండుతుంటే ఆ బాధ తాలూకు సెగలు మాటల మూటలుగా వెలువడుతుంటాయి."

"గురూ నీవు కథలు వ్రాసెయ్..."- లక్ష్మణ్.

"ఆపని మాత్రం చేయను."

"ఏం?"

"నన్ను మర్చిపోయి ఎక్కడో ఎవరి సమక్షంలోనో ప్రశాంతంగా కాలం గడుపుతున్న వారి ఎదుట, రచయితగా నిలిచి వారి గుండెల్లో గాయాల్ని రేపలేను."

రఘు ఏం మాట్లాడుతున్నాడో అర్థంగాక ప్రతిమలా నిలబడిపోయారు.

కాలేజీ అవర్స్ పూర్తికాగానే హాస్టల్‌కి చేరుకున్నారు.

తమ ఊర్లో వుండగా స్కూలునుంచి రాగానే బామ్మ తనకోసమని ప్రత్యేకంగా వేసిన 'ఘనపకుడుం'ని తినే వెంకటపతికి 'ఆకలి' అనిపించింది.

వెంటనే తన పెట్టెలోని తినుబండారాన్ని బయటకు తీశాడు. అది గమనించిన లక్ష్మణ్ తానుకూడా ఇంటి నుంచి తెచ్చిన చిరుతిళ్ళని బయట పెట్టాడు.

టిఫిన్‌గా వాటిని ఆరగించి,మంచినీళ్ళుత్రాగి 'బ్రేవ్' మని త్రేన్చాడు.

ఆకలి సమస్య తీరేసరికి వెంకటపతికి ఏంచేయాలా? అన్న ప్రశ్న వచ్చింది. కాని ఏం చేయాలో తోచక అలాగే చవితి నాటి వినాయకుడిలా మంచం మధ్య తన్నిపెట్టుకొని కూర్చున్నాడు.

ఇద్దరి మధ్య మాటలు కరువయ్యాయి.

నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ "గురూ" అన్నాడు లక్ష్మణ్.

"ఏమిటి" అన్నట్టుగా చూశాడు.

"ప్రాక్టికల్స్‌కి ముప్పై మార్కులున్నాయట. ఇప్పట్నుంచే మనం ఆ డిమాన్‌స్ట్రేటర్లని మంచి చేసుకుంటే బాగుంటుంది తీరా పరీక్షల ముందయితే మనలా చాలా మంది తయారవుతారు. పైపెచ్చు వాళ్ళకి అసలు విషయం తెలిసి దగ్గరకు రానివ్వరు" ఏ గుళ్లోని దేవుడిలా బద్ధకంగా కూర్చున్న వెంకటపతిలో చలనం వచ్చింది.

"ఆలోచన బ్రహ్మాండగా వుంది. మరి ఆచరణలో పెట్టడం ఎలా?

"ఏముంది, ముందు ఎదురు పడినప్పుడు నమస్కారం పెడదాం"

"ఎదురుపడకపోతే!"

అయిష్టంగా ముఖం పెట్టి "ఆయన కాలేజీకి ఏగేటు గుండా వస్తారో చూస్తాం. ఏదో పనున్నట్టు ఆ గేటు దగ్గర మాట్లాడుతుంటాం. రెండుసార్లు నమస్కారాలు పెట్టి తర్వాత ఆయనే నవ్వుతూ మనతో మాట్లాడతారు"అన్నాడు లక్ష్మణ్.

"మాఊళ్లో పంతులుగారికి వెన్న, కాయగూరలు తీసి కెళ్ళి ఇచ్చేవాళ్ళం. అలాంటివి ఇక్కడ ఇవ్వగూడదా?"

"ఎందుకివ్వగూడదు? పైపెచ్చు పట్నంలో అవి అసలు దొరకవాయె. కాకపోతే కొంచెం జాగ్రత్తగా ఇవ్వాలి. మనం ప్రాక్టికల్ మార్కులకోసం ఇవన్నీ చేస్తున్నాం అని ఆయన పసిగడ్తే మొత్తం బెడిసికొడ్తుంది. అందుకని ఏదైనా చిట్కా వేయాలి".

"చిట్కా అంటే?"

"ఏం లేదు. ఆయన ఖాళీగా వున్నప్పుడు అది తెలియలేదు, ఇది తెలియలేదు. అని ఆయనని అడుగుదాం.

ఎప్పుడో ఒకప్పుడు ఇప్పుడు ఖాళీగా లేను సాయంత్రం ఇంటికి రండి అంటాడు. ఇహ అంతే! ఆయన ఇంటికే మన రాకపోకలు. ఏ పండుగకో ఇంటికెళ్ళినప్పుడు వస్తూ వస్తూ ఆయనకంటూ కొన్ని తీసుకురావాలి. దాంతో మన సంబంధాలు 'టంకం' వేసినట్టు అతుక్కుపోతాయి."

"భలే సలహా చెప్పావ్ లక్ష్మణ్!" సంతోషంతో షేక్‌హ్యాండ్ ఇచ్చాడు వెంకటపతి.

"అయ్యో నా చెయ్యి" విలవిలలాడిపోయాడు లక్ష్మణ్.

"ఓ..." అంటూ చెయ్యి వదిలిపెట్టాడు.

తర్వాత ఏ విషయం మాట్లాడాలో తోచలేదు.

ఇద్దరిమధ్య మాటలే కరువయ్యాయి.

మౌనం రాజ్యమేలసాగింది.

చివరకు అన్నాడు వెంకటపతి. "అలా గ్రౌండులోకి వెళ్ళొద్దామా" అని.

"సరే పద" అంటూ లేచాడు వెంకటపతి.

రూముకి తాళంపెట్టి ఇద్దరూ బయటకు నడిచారు.

సువిశాలమైన గ్రౌండు అది.

రబ్బిస్ వేసిన గ్రౌండ్సు సిమెంటురోడ్డులావున్నాయి.

ఒక్కోగ్రౌండులో ఒక్కో ఆట ఆడుతున్నారు.

క్రికెట్ ఆడుతున్న గ్రౌండులో సిమెంటుతో కట్టిన గ్యాలరీ వుంది. ఆ గ్యాలరీ వైపు దారి తీశారు.

ఊసుపోక గ్రౌండులో కూర్చునున్న వారిదృష్టంతా వెంకట్-లక్ష్మణ్‌ల మీదే కేంద్రీకృతమయింది. అందుకు రెండుకారణాలున్నాయి. లొటలొటా పంట్లాంతో. ఊలు కుచ్చు కుట్టిన గూడెం చెప్పులు అరఫర్లాంగు దూరం విని పించేలా "కిరు. కిరు" మంటుంటే భుజాలమీదకు వ్రేళ్ళాడు తున్న జుట్టుతో, వినాయకుని బొజ్జని మరిపించే పొట్టతో, చిన్నసైజు గున్నలా వెంకటపతి సాక్షాత్కరించ

దం ఒక కారణమయితే, సన్నగా పొట్టిగా, బోడిగుండుతో కొళ్ళను మార్క్సలా వున్న లక్ష్మణ్ వెంకటపతి కూడా తిరగడం రెండవ కారణం.

ఎన్నో జతల కళ్ళు తమనే చూస్తున్నాయని గ్రహించిన ఆ ఇద్దరు గ్యాలరీపైకి నడవగారు.

"అంతలో "ఒరేయ్! ఈపీనుగ ఆ ఏనుగుని విడిచి పెట్టదేమిట్రా అన్న మాటలు వినిపించడంతో, అప్రయత్నంగా ఆ మాటలు వినిపించిన వైపుచూశాడు వెంకటపతి.

నల్ల కుక్కపిల్లలా సన్నగా పొట్టిగా వున్న ఆకారం కనిపించింది. తలమీద సగం వరకు జుట్టు ఊడిపోవడంతో వెనక జుట్టుని 'హేద్'లా నుదుటిమీదకు దువ్వుకున్నాడు. తమని ఏనుగ-పీనుగ అన్నందుకు కోపం వచ్చినా, కుక్కపిల్లలా ముడుచుకొని కూర్చునివున్న ఆ వింత ఆకారాన్ని చూసి అనాలోచితంగా నవ్వేశాడు వెంకటపతి.

తిట్టినందుకు మీదపడి పోట్లాడతాడనుకున్న వ్యక్తి అలా నవ్వేసరికి ఏం చేయాలో తోచక, "పీడెవడ్రా! భలే గొప్పోడిలా వున్నాడే" అన్నాడు ఆ శునకేశ్వరరావు.

అప్పటికీ వెంకటపతికి కోపం రాలేదు. చిదానంద స్వామిలా నవ్వుతూ బొజ్జ నవరించుకుంటూ అతడ్నే చూస్తుండిపోయాడు

అప్పటివరకు కేవలం ప్రేక్షకుడిగానే మిగిలిపోయిన ఆ శునకేశ్వరరావు ప్రక్కనున్న వ్యక్తి "ఊరుక్కోరా" అని మిత్రుడ్ని వారించి, "సారీ బ్రదర్! మావాడు స్నేహితులు అనుకున్నవార్నెవరినయినా అలాగే జోక్ చేస్తుంటాడు" అన్నాడు.

"ఓ... వెరి గ్లాడ్ టు సి యు" అంటూ షేక్ హ్యాండ్ ఇచ్చి "మై సెల్ఫ్ వెంకటపతి. హి యీజ్ మై ఫ్రెండ్ లక్ష్మణ్" అని పరిచయం చేశాడు.

అదిరిపడి చూశాడు ఆ వ్యక్తి.

తాము ఎవరినయితే వెర్రి వెంగలప్ప అనుకొని ఏడిపించారో, ఆ వ్యక్తి వెంగలప్పకాదని, వెల్ లెర్నెడ్ ఐ-గుడ్ బిహేవియర్‌గల వ్యక్తి అని భ్రమపడిన అతడు, "చాల సంతోషం. నా పేరు జి. ఆర్. జి. కె. స్వామి అంటే జి. రాధా గోపాలకృష్ణస్వామి" అని వెర్రి నవ్వొకటి విసిరాడు

ఇదంతా చూస్తున్న భువనేశ్వరరావు అదిరిపడ్డాడు.

"వీడు నా ఫ్రెండు సత్తిరాజు" అంటూ భువనేశ్వర రావుని పరిచయం చేశాడు స్వామి.

"వెరి గ్లాడ్ టు సి యు ... మిమ్మల్ని క్లాసులో చూశాను. కాని మాట్లాడటం ఇదే మొదలు"

"మనమంతా ఫ్రెండ్సు అయిన ఈ సందర్భాన్ని పురస్కరించుకొని క్యాంటీన్‌కెళ్ళి కాఫీ త్రాగుదాం" అన్నాడు సత్తిరాజు.

"ఆలస్యం దేనికి, బయలుదేరు" అన్నాడు స్వామి.

మొదటి క్షణంలో 'క్యాంటీన్' అంటూ ఒకటుందా అని ప్రశ్నార్థకంగా ఒకరి మొహాలొకరు చూసుకున్న వెంకటపతి, లక్ష్మణ్ మరుక్షణంలోనే తేరుకొని "మాకూ తెలుసు" అన్నట్టుగా సత్తిరాజుని అనుసరించారు.

"మీ రూము నెంబరెంత?" ఇత్యాది ప్రశ్నలడుగుతున్న సత్తిరాజుకి నడుస్తూనే ఓపిగ్గా సమాధానం చెబుతున్న వెంకటపతి తమ నలుగురికి తాము ముగురే కనబడటంతో నాలుగోవ్యక్తి ఏమయ్యాడా? అని వెనుకకుచూశాడు.

తన సహజధోరణిలో మూడడుగులు ముందుకేస్తే రెండడుగులు వెనుకకు వేసుకుంటూనత్తనడక నడుస్తున్నాడు లక్ష్మణ్.

చివరకు ఎలాగైతేనేం క్యాంటీన్ చేరుకున్నారు.

ఆ విధంగా పరిచయమయిన వారు స్నేహితులుగా మారారు. మెస్‌కి వెళ్తే నలుగురూ ఒకచోటే కూర్చుంటారు. కాలేజికి నలుగురూ కలిసే వెళ్తారు. కలిసే తిరిగి వస్తారు. నలుగురిలో ఏ ఒక్కరు ఏ చిన్న వస్తువుకొనాలన్నా నలుగురూ కలిసివెళ్ళి కొంటారు. ఫలితంగా వస్తువు ధరకన్నా వారు రిక్షాలకి పెట్టిన ఖర్చు ఎక్కువగా వున్న రోజులు లేకపోలేదు.

ఒక రోజున... మెస్‌లో...

అందరికీ ఊతప్పాలు సర్వే చేస్తున్నారు.

కాని వెంకటపతి మిత్ర బృందం కూర్చున్న టేబుల్‌కి ఎదురుగానున్న టేబుల్ దగ్గర కూర్చున్నవాళ్ళు మాత్రం ఊతప్పాలు వద్దని బ్రెడ్ జామ్ తెప్పించుకున్నారు. ఉంటున్నది ఒకే హాస్టల్‌లో. చదువుకుంటున్నది ఒకే క్లాసులో అయినా ఊతప్పం బ్యాచ్ బ్రెడ్ జామ్ బ్యాచ్‌తో కలవదు. వేషభాషలలోను, ప్రవర్తనలోను రెండుబ్యాచ్‌లకు చుక్కెదురు.

బ్రెడ్ జామ్ బ్యాచ్ లాల్చీలాంటి బొమ్మల షర్టులు, పైజమాలాంటి పంట్లాంలు. అవీ కాటన్‌వి ధరిస్తారు. మాసిన గెడ్డాలతో, జడ్డు తలతో చేతులకి కడియాలు, మెడలో లాకెట్లు పూసల దండలు ధరించడం నాగరికతగా భావిస్తారు. వీలైనంత తక్కువ తెలుగు మాట్లాడటం ఫ్యాషన్‌గా బ్రెడ్-జామ్‌లు, ఆమ్లెట్లు టిఫిన్‌గా తీసుకోవడం ప్రోగ్రెసివ్‌గా భావించేవారు. ఊతప్పం బ్యాచ్ అంటే చాల చులకన భావం వుంది.

అలాగే అవసరంవున్నా లేకున్నా, ఆఖరికి తెలుగు మాష్టారితో కూడా ఇంగ్లీషులోనే మాట్లాడుతూ తమ మాతృభాష ఇంగ్లీషే అన్నట్టుగా పోజిచ్చే బ్రెడ్ జామ్ బ్యాచ్ అంటే ఊతప్పం బ్యాచ్‌కి అక్కసు. అందుకే వీరు వారిని

'బ్రెడ్ జామ్ గాళ్ళు' అంటే, వారు వీరిని 'ఊతప్పంగాళ్లు' అంటారు.

బ్రెడ్ జామ్ బ్యాచ్‌కి తమ మెంబరొకడు పొరపాటున ఊతప్పం బ్యాచ్‌లో కలిసిపోయాడే? అన్న బాధ కలిగింది. వారనుకుంటున్న ఆ వ్యక్తి వెంకటపతి.

గూడెంలో కుట్టించిన ఊలు కుచ్చుతోలు చెప్పులు, పదవ క్లాసు పాసయితే కాకాని స్వామికి మొక్కుగా ఇస్తానన్న జుట్టు, బొజ్జ కనిపించకుండా వుండటానికి కుట్టించిన లూజు షర్టు వారికా అభిప్రాయాన్ని కలుగజేశాయి

ఒకరిద్దరు "మీ చెప్పులు బాగున్నాయి. ఎక్కడ కొన్నారు? అని అడగను కూడా అడిగారు. తన చెప్పుల్ని బ్రెడ్ జామ్‌గాళ్ళు ప్రశంసించేసరికి ఆనందంతో వెంకటపతి కంఠం మూగబోయింది.

కాని వెంకటపతి అసలు విషయం ఎక్కడ చెప్పేస్తాడోనని "ఢిల్లీనుంచి వాళ్ళ మావయ్యగారమ్మాయి తెచ్చింది"అని తడుంకోకుండా సమాధానమిచ్చాడు సత్తిరాజు.

వెంకటపతి మేనమామ రాష్ట్రపతి భవన్‌లో ఉన్నతోద్యోగి అని, ఆయనకో అందాల భరిణెలాంటి కూతురుందని, ఆమెకి వెంకటపతి అంటే ఏన్వే 'లవ్' కూడా వుందని తరచుగా కాస్ట్లీ గిఫ్ట్సు పంపిస్తుందని ఒక బాంబు పేల్చాడు రాధాగోపాలకృష్ణస్వామి.

'అదృష్ట వంతుడు వెంకటపతి' అనుకున్నారు కొందరు, ఆ విషయం విని.

"వట్టి వెధవ" కాకుంటే అంత పొజిషన్ వున్న మావ కూతురు తనకు తానుగా ముందుకొస్తే మరొకడయితే వూరుకుంటాడా అన్న వాళ్ళు కూడా లేకపోలేదు.

ఏది ఏమైతేనేం వింత ఆకారం వల్ల, చిత్రమైన చేష్టలవల్ల పలువురికి వెర్రివెంగలప్పలా సుపరిచితుడయిన

వెంకటపతి ఇప్పుడు మరోవిధంగా ప్రచారమయ్యాడు. దానితో వెంకటపతితో పరిచయం పెంచుకోవాలి అన్నవారి సంఖ్య పెరిగింది.

కాని - ఆడపిల్ల ఎదురయితేనే చాలు అష్ట వంకర్లు తిరిగిపోయే వెంకటపతి తనకొక 'లవ్ ఎఫైర్' వుందని వినే సరికి ఉలిక్కిపడ్డాడు. భయంతో హృదయ స్పందన రెట్టింపయింది.

'అంతా అబద్ధం' అని అరవాలనుకున్నాడు. కాని అతడికా అవకాశం చిక్కలేదు.

*　　　*　　　*

ప్రాక్టికల్ రికార్డులో అంతా కలిపినా అయిదు పేజీలు వాడలేదు. కాని రెండవ సంవత్సరం చివరలో జరగనున్న ప్రాక్టికల్స్ మార్కుల గురించి తీవ్ర స్థాయిలో సమాలోచనలు జరుపసాగారు మిత్రులు నలుగురు.

ఫిజిక్సు, కెమిస్ట్రీ, బోటనీ, జువాలజీ— నాలుగు డిపార్టుమెంట్లకు చెందిన నలుగురిని ఏక కాలంలో 'కాకా' పట్టడం కష్టమని భావించారు. పైపెచ్చు తమ మధ్య తమకే పోటీ వుండకూడదని ఒక ఒప్పందానికి వచ్చారు. దాని ప్రకారం చీట్లు వేశారు. ఎవరు ఏ డిపార్ట్‌మెంట్ డిమాన్‌స్ట్రేటర్ని 'కాకా' పట్టవలసింది నిర్ణయించుకున్నారు. ఆ తర్వాత నమస్కార బాణాలతో యుద్ధాన్ని ప్రారంభించి బుద్ధిమంతుల్లా పోజుపెడ్తూ 'అది తెలియలేదు, ఇది తెలియ లేదు' అంటూ ఖాళీదొరికినప్పుడల్లా ఎవరి డిమాన్‌స్ట్రేటర్ని వారు 'అప్రోచ్' కావడం ప్రారంభించారు.

సర్వ సాధారణంగా లెక్చరర్సు వుండగా డిమాన్‌స్ట్రేటర్సుకి అంతగా విలువ ఇవ్వరు. అలాంటిది వీళ్ళు తమ కంత విలువ ఇస్తుండేసరికి వెన్నపూసలా కరిగిపోయే

వారు. తమ ప్రయత్నాలు ఫలిస్తున్నందుకు మిత్రబృందం సంతోషించింది.

అంతలో ఫస్ట్ టరమ్ పూర్తి కావడంతో వారు ఆడుతున్న నాటకానికి తెర పడింది.

మధ్యకి సప్లిమెంట్ ఎగ్జామ్స్ వుండటంతో, ఫస్ట్ టరమ్ హాలిడేస్‌కి ఇంటికి వెంకటపతి ఒక్కడే బయలుదేరాడు, చేతిలో రెండు వందల రూపాయలున్నాయి. ఏం చేయాలి? అన్న ప్రశ్న ఎదురయింది, మిత్రుల్ని సలహా అడిగాడు.

"నీకు ఏదైనా కొనిపెడదానికి మీ బామ్మ వుంది. కాని ఆ బామ్మకి కొనిపెట్టే వాళ్ళెవరూ లేరు. పైపెచ్చు పట్నం నుంచి వెళ్తున్నావు. ఏదైనా తీసికెళ్ళు. ఆమె సంతోషిస్తుంది" సలహా ఇచ్చాడు స్వామి. ఈ ఆలోచన బాగుందన్నారు. నలుగురూ మార్కెట్‌కి వెళ్ళారు.

కాని బామ్మకి తగింది ఏం కొనాలి? అన్న ప్రశ్న దగ్గరే తిరిగి ఆగిపోయారు.

"తెల్ల చీరలు" అన్నాడు లక్ష్మణ్.

'కాని మా బామ్మకి పెటుడు చీరలున్నాయి' అంటూ ఆ ప్రపోజికల్‌ని కొట్టేశాడు వెంకటపతి.

"చెప్పులు" అన్నాడు సత్తిరాజు.

"మా పనివాడు కుట్టించి చెప్పుల్ని, గొడుగు బల్లమీద దాస్తుంది. ఇహ నేను తీసికెళ్ళినా ఇవికూడా బల్లెక్కుతాయి" అంటూ ఆ ప్రపోజల్‌ని కూడా ప్రక్కకు నెట్టేశాడు.

"మీ బామ్మ కళ్ళజోడు పెడుతుందా?" అప్పటివరకు మౌనంగా వున్న లక్ష్మణ్ అడిగాడు.

"పెడుతుంది"

"అయితే కూలింగు స్పెక్ట్స్ కొను. మోడర్న్‌గా వుంటుంది.

"కూలింగు స్పెక్ట్సుని తీసికెళ్ళినా పెట్టుకుంటుందా?" సందేహాన్ని వెలిబుచ్చాడు వెంకటపతి.

"తనకు తానుగా పెట్టుకుంటాను అని చెప్పి కొని పించి పెట్టుకుంటుందా. ఏమిటి? నీవు కొని తీసికెళ్ళాలి గాని" అంటూ మెత్తమెత్తగా కోపడ్డాడు సత్తిరాజు.

"అవున్రా కొనెయ్" వత్తాసు పలికాడు స్వామి.

ఏమయితేనేం, బామ్మగారి కొరకు కూలింగు స్పెక్ట్సు వెతకడం ప్రారంభించారు.

చివరకు పైబర్ ఫ్రేమ్ స్పెక్ట్సు ఒకటి సెలెక్టు చేశారు. బిల్ చెల్లించి బయటకు వస్తుంచగా, పగిలిపోయిన కళ్ళద్దాల జోడుని జాగ్రత్తగా పట్టుకొని మెల్లగా అడుగులు కదుల్చుకుంటూ హేండ్ స్టిక్ సహాయంతో మెట్లుక్కుతున్న ముదుసలి ఎదురు పడ్డాడు.

"ఒరేయ్ వెంకటపతీ" అంటూ గావుకేక పెట్టాడు లక్ష్మణ్.

మిగతా ముగ్గురూ ఆందోళనగా చూశారు.

"అయిడియా... బామ్మ సంతోషించాలంటే నీవు మరొక పని చేయాలిరా"

"ఏమిటది"

చెప్తాను. అని అలవోకగా నవ్వాడు.

"వెధవ సస్పెన్స్. నీవు...త్వరగా చెప్పి ఏడ్వక"

"ముసలివాళ్ళకు ఒక చోట నుంచి మరో చోటుకి వెళ్ళాలంటే పిల్లల ఆసరా కావాలి. పిల్లల ఆసరాలేనప్పుడు చేతికర్ర కావాలి. అందువల్ల బామ్మకు నీవు చేతికర్ర కొనుక్కెళ్ళు. ఆవిడ ఎంతో సంతోషిస్తుంది" అన్నాడు లక్ష్మణ్.

"అమ్మ వెధవా, ఏం బుర్రరా! బుర్రంటే నీదే ననుకో" అంటూ 'టింగు'మని మ్రోత వినిపించేలా మొట్టికాయ వేశాడు సత్తిరాజు.

"సలహా చెప్పినందుకు ఐస్‌క్రీమ్ తినిపించాలి గాని, మొట్టికాయ...అదీ బోడి బుర్రమీద వేస్తారట్రా" అన్నాడు లక్ష్మణ్.

"అలాగే బ్రదర్ తినిపిస్తానుగాని, ముందు చేతికర్ర కొందాం పదండి" అంటూ ప్రక్కనే వున్న ఫ్యాన్సీ అండ్ కంగన్ హాల్‌లోకి దారి తీశారు.

వాకింగ్ స్టిక్ ఒకటి కొన్నారు.

బామ్మకొరకు కూలింగు స్పెక్ట్సు, వాకింగ్ స్టిక్ కొన్న తర్వాత స్నేహితులు నలుగురూ హోటల్‌లోకి ప్రవేశించారు. అన్నమాట ప్రకారం అందరికీ ఐస్‌క్రీమ్‌లు తెప్పించాడు వెంకటపతి. కాని. ఐస్‌క్రీమ్ తింటున్న సత్తిరాజుకి వెధవ అలోచన ఒకటి వచ్చింది. వెంటనే ఆ ఆలోచనని తనలోనే దాచుకోలేక "ఒరేయ్! హైస్కూల్ స్టూడెంట్సుగా మనం మన ఊళ్ళని వదిలి పెట్టాం, తిరిగి రెండు నెలలకు అదీ కాలేజీ స్టూడెంట్సుగా – పై పెచ్చు లయోలా కాలేజీ స్టూడెంట్సుగా మనం మన ఊళ్ళకి వెళ్తున్నాం. ఇప్పుడు మనల్ని చూడటానికి చాలామంది వస్తారు. ఆ వచ్చేవారిలో మన పనివాళ్ళ దగ్గర్నుంచి, మన స్కూలు మేష్టర్లవరకు వుంటారు. మనలో ఏ విధమయిన మార్పు కనిపించక పోతే అఁ! అని నోరు చప్పరించేస్తారు. అదేగనక ఏదైనా మార్పు కనిపిస్తే అబ్బో, పలానవాళ్ళబ్బాయి పట్నంలో చదువుల్ని మొదలెట్టినతర్వాత ఎంతగా మారిపోయాడని! అని అంతా అబ్బురంగా చెప్పుకుంటారు. దానితో మనకు ప్రెస్టేజ్ పెరుగుతుంది. ఏమంటారు" అనేశాడు పైకి,

"నిజమే" అంటే "నిజమే" అని అంతా ముక్తకంఠంతో సత్తిరాజు అభిప్రాయాన్ని ఆమోదించారు. తమలో ఏదో క్రొత్తదనాన్ని చూపించాలని నిర్ణయించు

కున్నారు. అందుకు తొలిమెట్టుగా "ఇన్‌షర్టు" చేసుకొని మరీ తమ ఊరి పొలిమేరలోకి అడుగు పెట్టాలని నిశ్చయించుకున్నారు. బెల్టులేనివారు బెల్టు కొనాలనుకొన్నారు. చదివేది, క్రిష్టియన్ మిషనరీస్ కాలేజీలోగనుక టోపీ పెట్టుకుంటేనే ఆ హుందాతనం వస్తుందని అనుకున్నారు. ఆ పైన తమ ఊళ్ళో అందరితో వీలైనంత ఎక్కువగా ఇంగ్లీషులోనే మాట్లాడాలని తీర్మానించారు.

*                    *                    *

అనుకున్న ప్రకారం టోపీలు, బెల్టులు కొని ఎవరి ఊరివైపు వారు బయలు దేరారు.

ఒకరోజున కిరు చెప్పులు ధరించి, కాసిపోసి పట్టిన పంచెతో భుజాన పాత పెట్టె ఒకటి పెట్టుకొని కాలేజీకి బయలుదేరి వచ్చిన వెంకటపతి ఈ రోజున పంట్లాంలోకి చొక్కా టోపి, బెల్టుపెట్టి 'టక్' చేసుకున్నాడు. టోపీ పెట్టుకున్నాడు. బొమ్మకని కొన్న కళ్ళజోడు ట్రయల్ వేద్దామని తానే పెట్టుకొన్నాడు. ఒక చంకకు బ్యాగ్ తగిలించుకొని, మరో చేతిలో బొమ్మకని కొన్న హ్యాండ్ స్టిక్ ఊపుకుంటూ తమ ఊరి బస్ స్టాండునుంచి ఇంటివైపు దారి పట్టాడు.

తనకు బాగా పరిచయమున్నవారు ఒకరిద్దరు ఎదురుపడి కూడా పలకరించకుండా ప్రక్కకు తప్పుకొని పోవడంలో, "ఏమిటి ఇంత కాలానికి సొంత ఊరు" వస్తే ఏ ఒక్కడూ పలకరించడే "అనుకున్నాడు. మరుక్షణంలోనే తన టోపీ గుర్తొచ్చి, "ఓహో నా షేపులు మారిపోయాయన్నమాట" అనుకున్నాడు. అందుకు సంతోషించాడు. కాని ఏ ఒక్కరూ తనని గుర్తించకపోతే, తాను ఈ విధంగా మారిన సంగతి వారికి తెలిసేది ఎలా ? అనుకున్నాడు.

దాని పరిష్కార మార్గంగా తానే వాణ్ని పలకరించాలనుకున్నాడు. అంతలో అదే దోవన వస్తున్న సుబ్బారావు కనిపించాడు. గడ్డి తట్ట నెత్తినెత్తుకొని వస్తున్న సుబ్బారావు వెంకటపతితో అయిదో తరగతి వరకు కలిసి చదివాడు. ఆ తర్వాత వ్యవసాయం పనుల్లోకి వెళ్ళిపోయాడు.

అటువంటి సుబ్బారావుతో ఈమధ్యకాలంలో-అంటే గత అయిదేళ్ళనుంచి సన్నిహితంగా వుండడంలేదు. కాని ఈవేళ అవసరం తనది. అందుకే పలకరించాలి. లేకుంటే ఇంటికి వెళ్ళేలోపు తనని ఎవరూ గుర్తించకపోవచ్చు.

'సుబ్బారావ్! బాగున్నావా' అనిఅడిగాడు. దగ్గరకు వచ్చినవాణ్ణి 'ఎవరూ' అంటూ పరీక్షగాచూసిన సుబ్బారావు 'ఒరేయ్ వెంకటపతి నువ్వట్రా! ఇంగ్లీషు దొరలా టోపీ పెడ్తే వెంటనే గుర్తుపట్టలేక పోయాన్రా'

అప్పుడుగాని వెంకటపతికి బల్బు వెలగలేదు. సత్తిరాజు చెప్పినట్లు తాను ఇంగ్లీషులో మాట్లాడటం లేదని గ్రహించాడు. 'యస్ లుక్స్ లైక్ తెల్లదొర' అన్నాడు నల్లపోతులా వున్నాడు వెంకటపతి. ఎదుటవ్యక్తికి బొత్తిగా ఇంగ్లీషురాదుగనక, మొన్నమొన్నటివరకు తనతోపాటు చదువుకున్న వెంకటపతి హఠాత్తుగా ఇంగ్లీషులో మాట్లాడుతుంటే, 'అబ్బో వీడు ఇంగ్లీషు దంచేస్తున్నాడే' అనుకొంటూ తెల్లమొహంవేసుకొని చూస్తుండిపోయాడు. "సో, యుఆర్ స్టిల్ వర్కింగ్ ఇన్ ఫీల్డ్స్" హ్యాండు స్టిక్ స్టైయిల్‌గా వూపుతూ అడిగాడు.

గత అయిదేళ్లుగా సుబ్బారావు ఏంపని చేస్తున్నాడో ఆపనే ఇప్పుడూ చేస్తున్నాడని తలపైవున్న గడ్డిమోపు చెబుతోంది. తాను ఊళ్లోలేని ఈ రెండు రోజుల్లోనే ఊరంతా మారిపోయినట్టు మాట్లాడసాగాడు వెంకటపతి.

'నీవు ఇంగ్లీషు మాట్లాడుతుంటే నాకు అర్థం గావటంలేదురా, తెలుగులో మాట్లాడరా'

ఏదో వినరానిది విన్నవాడిలా 'తెలుగా' అని మా కాలేజీలో ప్రొఫెసర్సు, లెక్చరర్సు, సిబ్బంది, వార్డెన్సు లెక్చరర్సు, మెస్ బోయెస్ కూడా ఇంగ్లీషే మాట్లాడతారు. ఆ అలవాటున పొరపాటున మాట్లాడుతున్నాను" అన్నాడు.

సుబ్బారావు కళ్ళు ఆశ్చర్యంతో విశాలమయ్యాయి.

"సో, యు ఆర్ ఆల్‌రైట్" చిరునవ్వులు చిందిస్తూ అడిగాడు. అందుకేమని సమాధానం చెప్పాలో తెలియక "తలమీద బరువుంది. ఇంటి దగ్గర మీ బామ్మ ఎదురు చూస్తుంటుంది. నీవు పద. నేను బరువుదించొస్తా" అన్నాడు సుబ్బారావు.

"ఓ.కె...సి యు" అంటూ ముందుకు నడిచాడు.

ఇప్పుడు వెంకటపతికి చాల సంతోషంగా వుంది. పట్నం వెళ్ళి తానెంతో మారిపోయాడు ఎదిగాడని అన టానికి సుబ్బారావే నిదర్శనం— అనుకున్నాడు వెంకటపతి.

---

'ఈ అయిడియా సత్తిరాజుది' అన్న ఆలోచన రాగానే సత్తిరాజుపట్ల గౌరవభావం ఏర్పడింది వెంకట పతిలో. దారిలో కనిపించిన ప్రతి ఒక్కర్ని పేరు పేరున, వరస వరసనా పలకరించి అధమం అయిదు నిమిషాలయినా మాట్లాడి." ఓర్ని ఎంతగా మారిపోయావు...నేను గుర్తు పట్టనేలేదు సుమీ" అంటూ ప్రశంశా వాక్యాల్ని అందుకొని మరీ ఇంటికి వెళ్ళాడు.

విజయ పరంపరలందుకొని, పురజనుల జయజయ ధ్వానాల మధ్య కోటలోకి అడుగు పెట్టిన రాజకుమారునిలా కాలి చెప్పులు "కిర్రు"మని శబ్దం చేస్తుండగా, విలాసంగా హేండ్ స్టిక్ ఊపుకుంటూ ఇంట్లోకి ప్రవేశించాడు.

ఎండబోసిన కందుల్ని ఆరతిప్పుతున్న బామ్మ ఆ శబ్దానికి తలెత్తి చూసింది. "పగటి వేషగాళ్ళు మళ్ళీ తయారయ్యారు కాబోలు" అనుకొని "పనిమీదున్నాను ప్రక్కింటికెళ్ళవయ్యా" అన్నది.

బామ్మ ఆ మాటలు ఎవర్ని ఉద్దేశించి అన్నదో అర్థంగాక, తనవెనక ఎవరైనా వున్నారేమోనని వెనుదిరిగి చూశాడు. కాని ఎవరూ లేకపోవడంతో ఆ మాటలు తన నుద్దేశించే అన్నదని నిర్ధారించుకొని, "బామ్మా! నన్ను గుర్తుపట్టలేదంటే" అంటూ లంకానగరాన్ని హనుమంతుడు లంఘించినట్టు రెండగల్లో బామ్మని సమీపించాడు.

"ఎవరూ" అని ముక్కుమీదకు జారిన కళ్ళజోడుని పైకెగదోసుకుంటూ పరీక్షగా చూసి, "వెంకటపతీ! నువ్వట్రా?" అన్నది.

"నేనే..." అంటూ కళ్ళజోడు తీసి, "నీవు పెట్టుకోవాలిసింది ఆ జోడుకాదు, ఈ జోడు" అంటూ ఇచ్చాడు.

"వీడికేమయింది ఇలా తయ్యారయ్యాడు"అన్నట్టుగా విస్మయంగా చూడసాగింది.

"బామ్మా! మా కాలేజీలో ఫాదర్సు, బ్రదర్సు, సిస్టర్సు, వార్డెన్సు, లెక్చరర్సు అంతా కూలింగ్ గ్లాసెస్ పెట్టుకుంటారు. ఏజ్డ్ పర్సన్సు అంతా ఈ హేండ్ స్టిక్ చేతబట్టుకొని ఈవెనింగ్సులో అలాఅలా వాకింగుకి వెళ్తారు. వారందర్నీ చూస్తున్నప్పుడు నీవే గుర్తుకొచ్చేదానివి. అందుకే వస్తూవస్తూ ఇవి తెచ్చాను "

వెంకటపతి మాట్లాడుతున్నది సగంమాత్రమే అర్థమయినా, రోజూ ఎవర్నో చూసినప్పుడల్లా తననే తల్చుకొని బాధపడేవాడని అభిప్రాయపడిన బామ్మ "పిచ్చిసన్నాసి జానెడంతవాణ్ణి బారెడంతచేశాను. ఆ ప్రేమ వుండక ఏం చేస్తుంది" అనుకుంది.

బామ్మ అలా కళ్లప్పగించి తనవైపే చూడటానికి మరో అర్థం చెప్పుకున్నాడు వెంకటపతి.

"నా వేషాన్ని చూచి బామ్మ దంగయి పోయింది" అనుకొని "బామ్మా! ముందీ కళ్ళజోడు పెట్టుకో" అని బలవంతాన మసక కళ్ళజోడు తీసి కూలింగు స్పెక్ట్స్ పెట్టాడు చేతికి హ్యాండు స్టిక్ ఇచ్చాడు.

"ఒరేయ్ నువ్వీ కళ్ళజోడు పెట్టావుగాని నాకేం కన బడటంలేదు. ఇది పెట్టుకుంటే నీవు దొరబిడ్డలా వున్నావ్. నీవే పెట్టుకో" అంటూ కళ్ళజోడు తీసి వెంకటపతికిచ్చింది. తిరిగి తన మసక కళ్ళజోడు పెట్టుకుంది. అంతలో చుట్టు ప్రక్కల వాళ్ళు రావడంతో "రండీ..." అంటూ పిలిచి "మన వెంకటపతి వచ్చాడే" అన్నది ఆనందంగా "పట్నం నీళ్ళు బాగా పడినట్టున్నాయి రంగొచ్చాడు" అని ఒకామె అంటే "రంగుదేముందే. ముందు మనిషి రూపమే మారి పోతే" అని మరొకామె అన్నది.

వారలా పొగుడుతుంటే తన ఇంగ్లీషు పరిజ్ఞానం వారి ముందు ప్రదర్శించాలన్న కోరికను చంపుకోలేక పోయాడు.

"యస్...దెరీస్ ఎ వేస్ట్ ఆఫ్ ఛేంజ్" అన్నాడు.

"ఏమిటే అంటున్నాడు" అంటూ అమ్మలక్కలు ఒకరినొకరు అడిగారు.

"అరేయ్. నీవేదో పట్నంలో చదువుకున్నావని ఆ భాస మాదగ్గర మాట్లాడితే మాకేం తెలుస్తుందిరా! తెలు గులో చెప్పి ఏడవక" అన్నది బామ్మ.

"అయ్యో చెట్టంత పిల్లడ్ని పట్టుకొని ఏడ్వమంటా వేమిటమ్మా" అన్నదొక ఇల్లాలు.

"ఆ! గంపెడంత గుమ్మడికాయ అయినా కత్తిపీటకి లోకువే...ఈవేళ ఎంతవాడయినా పెంచిపెద్దచేసిన దానికి ఆ ధోరవే వుంటుంది" అన్నది మరొక ఇల్లాలు.

"నేను రేపు కలెక్టరయినా కొట్టడానికి, తిట్టడానికి, పెట్టడానికి మా బామ్మకే హక్కుంది. బామ్మలేనిదే నాకు బ్రతుకేలేదు" అన్నాడు వెంకటపతి. "చూశారటే, వెంకటపతి అంటే రత్నమే! పట్నంపోయినా పాడుఅలవాట్లు ఒకటయినా అబ్బాయంటే, ఇలాటి రత్నంలాంటి కొడుకు ఒకడుంటే చాలు" అన్నది పొరుగింటావిడ. బామ్మ కళ్లనుంచి జలజలా కన్నీరు జారింది.

వారంతా తనని అలా పొగుడుతుంటే, ఆనందంతో ఉప్పొంగిపోయాడు. షర్టు బటనొకటి "ఫట్"మని తెగిపోయింది.

వెంకటపతి భుజాన వ్రేలాడుతున్న బ్యాగ్‌ను చూసి, "అయ్యో నామతి మండ! ఇంటికొచ్చిన పిల్లాడ్ని గడపలో అడుగుపెట్టనివ్వకుండా వాకిట్లోనే నిలబెట్టి మాట్లాడుతున్నామే" అన్నదొకావిడ.

"అవునమ్మా. పిచ్చిగున్న ఎప్పుడు భోంచేసి బయలుదేరాడో, కాస్తంత మెతుకు పెడతాను సాయంత్రం రండమ్మా, తీరిగ్గా మాట్లాడొచ్చు" అని వారందర్నీ పంపిస్తుంటే ఈసురోమంటూ చూశాడు. "ఓహో బామ్మ వారందరి కోసమేనే ఇంతకష్టపడి "టక్" చేసుకొని వచ్చింది. నాకు ఆకలిలేదు పిండాకూడు లేదు అని మనసులో అనుకున్నాడు గాని పెదవి విప్పలేకపోయాడు.

"లోపలికి రారా" అనగానే బామ్మని పిల్లిలా ఫాలో అయ్యాడు

"నీవు వెళ్ళేటప్పుడు నిక్కరు మర్చిపోయి వెళ్ళావు. చక్కగా ఉతికించి దాచాను. ముందా దుస్తులు మార్చుకో" అంటూ పెట్టెలోని నిక్కరు తీసి ఇచ్చింది.

టోపీ, షర్టు, పంట్లాం మొత్తం విప్పేసి నిక్కరుతో తయారయ్యాడు. "భోజనం చేస్తావా?" అనడిగిన

బామ్మను "ఉదయం భోజనంచేసే బయలుదేరాను. అయినా సాయంత్రం నాలుగు గంటలవేళ భోజన మేమిటి?" ఎదురు ప్రశ్న వేశాడు.

"ఇక్కడుండగా రోజుకి నాలుగు సార్లు తినేవాడివి అక్కడికిపోయి నాజూకు తిళ్ళు నేర్చినట్టున్నావు, అందుకే ఏనుగులాంటి వాడివి పీనుగలా తయారయ్యావ్" అంటూ బల్లమీదున్న డబ్బా తెచ్చింది.

నవీ ముంచంమీద సిక్కరుమాత్రమే ధరించి పోతు రాజులా కూర్చునున్న వెంకటపతి అప్రయత్నంగా బొజ్జ వైపు చూసుకున్నాడు. గుమ్మడికాయలా ముందుకు పొడుచుకొని వచ్చిందది.

"పండుగకి వస్తున్నావని ఉత్తరం వ్రాశావుగా. గున్నకి చిరుతిళ్ళకి ఎంతగా మొహంవాచి వున్నావో అని కొబ్బరుండలు చేశాను. తిను" అంటూ డబ్బాముందు పెట్టింది

ఉండ్రాళ్ళ ముందు కూర్చున్న వినాయకుడిలా ఆ డబ్బా ముందు కూర్చున్నాడు.

అంతే!!

క్రమ క్రమంగా వెంకటపతి బొజ్జ బెలూన్‌లా ఉబ్బింది.

సిక్కరు వేసుకోవడంవల్ల ఏనుగు తొండాంలాంటి కాళ్ళు, తొడలు నల్లగా నిగనిగలాడుతూ కనిపిస్తున్నాయి.

కొబ్బరుండలు సుష్టుగా తినడంవల్ల పొట్ట మూరెడెత్తుకు పొంగింది.

గణాచారిలా పెంచిన జుట్టుతో కంచు విగ్రహంలా కూర్చునున్న వెంకటపతిని చూడగానే, "పిచ్చి గున్నకి ఆకలేగాని మితం తెలియదు. దొరిటోపి పెట్టుకొని దర్జాగా కర్రూపుకుంటూ వస్తుంటే ఊరంతా కళ్ళేసుకుని చూసింది.

ఎవరి కళ్ళలో ఏముందో "అనుకుంటూ గుప్పెడు ఉప్పు తెచ్చి వెంకటపతి చుట్టూతిప్పి పొయ్యిలో వేసింది.

కాని ఉప్పు చిటపటలాడక పోవడం గమనించి, "ఎంత దిష్టో చిట్టి తండ్రికి" అనుకున్నదేగాని, పొయ్యిలో నిప్పు లేదని గ్రహించలేక పోయింది. కాని ఏనుగు మీద పడిన వానజల్లులా వెంకటపతి వాటిని గమనించనేలేదు.

"బామ్మ్మ ఈ జుట్టు మెడమీదపడి చికాకు పెడు తుందే" గారబం పోయాడు.

"పిచ్చి సన్యాసి, అప్పుడే అంత తొందరయితే ఎలా నెమ్మదిగా వెళ్ళి మొక్కుబడి తీర్చుకుందాం" అని, బాగా బడలికగా ఉన్నావు కాసేపు పడుకో" అన్నది.

కాని, ఎప్పుడు వీదిలోకి వెళ్దామా, తన కాలేజి గురించి హాస్టల్ గురించి వాళ్ళకి ఎప్పుడు చెప్దామా అని ఉబలాట పడుతున్న వెంకటపతి "నాకిప్పుడు నిద్ర రావటంలేదే" అన్నాడు.

"పడుకోరా, నేను జోకొడతాను" అన్నది.

మరి కొంచెం ఆలస్యంచేస్తే బలవంతాన పడుకో బెట్టి జోకొడుతుందని, "ఒక్కసారి అలా వీధిలోకి వెళ్ళి మాష్టారు వాళ్ళకి కనిపించొస్తానే" అన్నాడు.

"కొద్దిసేపు వుండరా ఈ ముసిలిముండ నీ కోసం కళ్ళు కాయలు కాచేలా ఎదురు చూస్తుంటే అప్పుడే పోతా నంటావ్. ఇంతకీ మధు బావ విషయంగాని, నీ చదువు విష యంగాని చెప్పావు కాదు" అన్నది.

అడిగిందే తడవుగా లయోలా కాలేజి వైభవాన్ని, హాస్టల్ విశిష్టతని గుక్కతిప్పుకోకుండా చెప్పసాగాడు. సహనం కోల్పోకుండా వినసాగింది బామ్మ.

ఆ విధంగా పనివాళ్లదగ్గర, ఇరుగుపొరుగు ఆడవాళ్ల దగ్గర పదవక్లాసుతోనే చదువుకి స్వస్తిచెప్పిన స్నేహితుల

దగ్గర చిలవలుపలవలుగా చేసి నాలుగు రోజులపాటు నిర్వి రామంగా తన సోది చెప్పాడు.

గాజువారిన బామ్మ కళ్ళల్లో వెంకటపతి ప్రతిరూపం పడగానే కాంతిపుంజములు వెల్లివిరిశాయి.

'అమ్మా! నీ కొడుకు ఎంతగా ఎదిగిపోయాడే! నీవే బ్రతికుంటే ఈ స్థితిలోవున్న ఈఏన్నిచూసి ఎంత సంబర పడేదానివో' అని చాటుమాటుగా కళ్లొత్తుకో సాగింది.

రెట్టింపయిన ప్రేమతో నిత్యం వెంకటపతికి నలుగు పెట్టి, స్నానం చేయించేది, మీగడ కలిపి భోజనం ముద్దలు చేసి నోటికందించేది. కాని, "బామ్మా! ఈజుట్టు మెడమీద పడి చికాకుపెడుతోందే" అని తరచుగా మారాం చేసేవాడు వెంకటపతి.

"దేవుడి జుట్టు. ఆ మాటనకు నాయనా! ఈతఫా సెలవులకి వచ్చినపుడు కాకానివెళ్లి ఇచ్చొద్దాంలే" అనేది. "నా బామ్మా! నెక్స్టు శెలవులకి అ యామ్ నాట్ కమింగ్. అయామ్ రీడింగ్ ఫర్ ఎగ్జామ్స్" అంటూ వెంకటపతి బట్లర్ ఇంగ్లీషు మాట్లాడినప్పుడల్లా బామ్మగారు బోసి నోరంతా తెరచుకొని కళ్లప్పగించి చూస్తుండేది.

దొరబిడ్డలా ఇంగ్లీషు మాట్లాడుతున్నందుకు ఆనందం. రెండునెలల్లో వీడింతగా మారిపోయాడేమిటి! అన్నట్టు విస్మయం. రేపు చదువుకున్నదాన్ని చూస్తే వాళ్ళిద్దరూ తననొక వెర్రిదాన్ని చేసి తనముందే తనకు అర్థంగాకుండా ఇంగ్లీషులో ఏవేవో మాట్లాడుకోరుగదా! అన్న ఆందోళన.

అలా పలురకాల భావాలు ఆమెముఖంలో చోటుచేసు కున్నాయి. క్యాలెండరులో పదిరోజులు గడిచిపోయాయి.

ఇంకా దాదాపు పదిరోజులు శెలవులున్నాయి. కాని స్నేహితులు నలుగురూ వారం రోజులు ముందుగానే

రావాలని, వస్తూ వస్తూ ఎవరి డిమాన్‌స్ట్రేటరుకి వారు ఏవో కొన్ని తినుబండారాలు తీసికొచ్చి ఇవ్వాలని, రోజూ ఏదో ఒక పనిమీద వాళ్ళింటికి వెళ్ళాలని వాళ్ళ పిల్లల్ని ఒకటి రెండు సినిమాలకు తీసికెళ్ళి వారితో సన్నిహిత సంబంధం ఏర్పరచుక్కోవాలని నిశ్చయించుక్కోవడం జరిగింది.

అనుకున్న ప్రకారం పలురకాల వంటకాలతో, తయారుచేయించి. చెరుకు ముక్కలు పట్టుపట్టించి పట్నం బయలుదేరాడు

అత్తవారింటికి వెళుతున్న ఆడపడుచులా మూటలు పట్టుకొని వెళ్తున్న వెంకటపతిని చూడగానే బామ్మగారి కళ్ళలో నీలి తెరలు తొంగిచూశాయి.

-అదే బ్రతికుంటే కొడుకుని చూసి ఎంత మురిసి పోయేదో" అంటూ ఎన్నడో చనిపోయిన కూతుర్ని జ్ఞప్తి చేసుకొని కళ్ళొత్తుకుంది.

"ఎలాగూ అమ్మా - అయ్యాలేరు. కనీసం నేను బ్రతికుండగానయినా వాడిచేత ఏ కులమింటు కోతి మెడ లోనో మూడు ముళ్ళు వేయించాలి. ఆనక నేను పోయినా అత్తవారే వాడి జాగ్రత్త తీసుకుంటారు" అనుకున్నది.

* * *

అసంభవమని చెప్పదగిన సంఘటన ఒకటిజరిగింది. అది - స్నేహితులు నలుగురూ ఏ విధంగా విడిపోయి తమ గ్రామాలకు చేరుకున్నారో, అదే విధంగా విడి విడిగా తమ గ్రామాల నుంచి బయలుదేరినవారు ఒకేసారి కలుసుకున్నారు.

"ఇదేదో చాలా వింతగా ఉందే" అని సత్తిరాజు అంటే, "ఇహ మనల్ని ఏశక్తి విడదీయలేదురా" అన్నాడు లక్ష్మణ్. ఏమయితేనేం వారంతా అలా అయాచితంగా కలుసుకోవడం చాల సంతోషంగా వుంది. హాస్టల్ వైపు

బయలు దేరారు. తమ ఊర్లో ఉన్నన్నాళ్ళూ తిరిగ్గా దొరికిన ప్రతీ వాడికీ తన గోడు వినిపించిన వెంకటపతి ఇప్పుడూ ఆవకాశాన్ని జారవిడుపలేదు.

తాను ఏ విధంగా ఊళ్ళోకి అడుగు పెట్టింది, మొదట్లో తనని ఎలా గుర్తించనది, ఆ తర్వాత ఎవరే విధంగా అన్నది పూస గ్రుచ్చినట్లు చెప్పాడు. ఆ అయిడియా ఇచ్చినందుకు సత్తిరాజుకి ప్రత్యేకంగా కృతజ్ఞతలు తెలియ జేశాడు.

చివరకు ఎలాగైతేనేం హాస్టల్ చేరుకున్నారు,

పాడుబడిన బద్ధారామంలా వుంది హాస్టల్ బిల్డింగు.

శెలవు రోజుల్లో మెస్ వుండదు. దరిదాపుల్లో భోజనానికి కాదుగదా, కనీసం కాఫీ త్రాగుదామన్నా హోటల్ అంటూ లేదు. అందుకనే సప్లిమెంటు ఎగ్జామ్ ఇచ్చే వారంతా దేస్కాలర్స్ అయిన ఫ్రెండ్స్ రూముల్లోకి వెళ్ళారు,

చౌకీదారు చెప్పిన ఆ విషయం విన్న మిత్రులు హతాసులయ్యారు. "ఏమైతే అదే అవుతుంది" అనుకుంటూ తమ గదులకు వెళ్ళారు.

స్నానాలు గట్రాపూర్తిచేసి తక్షణ కర్తవ్యం ఏమిటో తేల్చడానికి అత్యవసర సమావేశం జరిపారు.

ముందు డిమాన్‌స్ట్రేటర్ల కొరకు ప్రత్యేకంగా తీసుకు వచ్చిన తినుబండారాల్ని వాళ్ళ ఇళ్ళ దగ్గర అందజేసి అటెండెన్సు వేసుకొని రావాలని తీర్మానించారు.

కాలేజీ పర్కింగు ప్లేస్ కానందున రిక్షావంటిది ఆ చుట్టుప్రక్కల మచ్చుకయినా కనిపించలేదు. అందువల్ల ఎవరుతెచ్చిన మూట వారే మోసుకుంటూ బయలుదేరారు.

వెంకటపతి క్యాండేటు ఫిజిక్సు డిమాన్‌స్ట్రేటరు. కొత్తగా కడుతున్న స్టేట్ బ్యాంక్ కాలనీలో తక్కువ అద్దెకు దొరికిందిగదా అవి ఇల్లు అద్దెకు తీసుకున్నాడు. అది

కొత్తగా కడుతున్న కాలనీ అయినందువల్ల బస్సౌకర్యం లేదు. ఆ సమయంలో రిక్షాలుకూడా లేనందువల్ల 'దేవుడా' అనుకుంటూ మూట భుజానవేసుకొని బయలుదేరాడు.

ఒకటి అరాకాదు సరిగ్గా మైలుదూరముంది ఆయన ఇల్లు. "ఎందుకొచ్చిన చదువురా బాబు" అనుకొంటూ ఈసురోమంటూ నడవసాగాడు వెంకటపతి శరీరం పెద్దది. కావడంవల్ల, ఆ శరీరాన్ని కదల్చలేక కదుల్చుతున్న వెంకటపతి అదనంగా భుజంపై భారంపడటంతో చెమటలు క్రక్కుతూ నత్తనడకతో ఎలాగైతేనేం కాలనీచేరుకున్నాడు.

"హమ్మయ్య వచ్చేశాను" అని తృప్తిగా నిట్టూర్చి, ముఖంమీద నవ్వు పులుముకొని డిమాన్‌స్ట్రేటర్ ఇంటికి వెళ్ళాడు. కాని ఇంటికి తాళంవేసి వుండటంతో తెల్లముఖం వేశాడు. అంతలో ప్రక్కపోర్షనామె "లేరు బాబు. శెలవులకి వాళ్లింటికెళ్ళారు. కాలేజీరోజుకి ఆయన వస్తారేమో" అన్నది.

వెంకటపతి నెత్తిన పిడుగుపడింది. నేతితో సున్నుండలు చేయించుకొచ్చాడు. ఇహ వీటితో డిమాన్‌స్ట్రేటర్ దంగయిపోతాడని, ఆయనే తనగదికి వస్తాడని ఊహించిన వెంకటపతి తన అంచనాలన్నీ తలక్రిందులు కావడంతో జావగారిపోయాడు.

'రాగానే అందజేయమని ప్రక్క ఇంటివారికిచ్చేకంటే, స్వహస్తాలతో అందజేయడమే ఉత్తమం' అనుకొని ఏడ్వలేక నవ్వుతూ హాస్టల్‌వైపు బయలుదేరాడు.

'అంత కష్టపడి తినుబండారాలు తయారు చేయించి, ఆయన కోసమని అయిదు రోజులు ముందుగా వస్తే ఆయనేమో ఊరు వెళ్ళాడు. ఏనాడయినా పూచీకపుల్ల అటుదిటు పెట్టి ఎరుగునా తాను? ఈ రోజున మూట భుజాన వేసుకొని మోయవలసి వచ్చింది. ఎంత దుర్గతి పట్టిందిరా వెంక

టపతి' అనుకుంటూ కాళ్ళీడ్చుకుంటూ హాస్టల్ చేరు కున్నాడు.

త్రిమూర్తుల్లా లక్ష్మణ్, సత్తిరాజు, స్వామి తాము తెచ్చిన మూటల్ని ముందు పెట్టుకొని కూర్చునున్నారు.

"ఒరేయ్, వెంకటపతికూడా మూటతో తిరిగి వస్తు న్నాడురా" అన్నాడు లక్ష్మణ్.

"వెల్ కమ్ టు పతి! మేము ముగ్గురమే అదృష్ట వంతులం అనుకుంటున్నాము. మాతో నీవూ చేరావా?"

"అదృష్టమేమిట్రా" అని రొప్పుకుంటూ భుజాన వున్న మూట తీసి క్రిందపెట్టి, "కొంప ముంచాడ్రా. ఇప్పటివరకు నీళ్ళ కడవకూడా మోయించలేదు మా బామ్మ. ఈ దీమాన్ స్ట్రేటరుకోసం ఈ మూట భుజాన వేసుకొని చచ్చీ చెడీ మోసుకెళ్ళినా ఫలితం లేకపోయిందిగదరా" అన్నాడు.

"తొందరపడకు. అదీ మన మంచికే జరిగింది"

'మంచికా?' అన్నట్టుగా చేపల దాకలా నోరు తెరిచాడు వెంకటపతి.

"కాలేజీ తెరవడానికి ఇంకా అయిదురోజుల పైముంది. అప్పటివరకు మనకు ఫుడ్ ఇవే!" చావు కబురు చల్లగా చెవినేశాడు సత్తిరాజు.

అసలే అంతదూరం నడిచి ఆయాసంతో రొప్పుతున్న భోజనప్రియుడు వెంకటపతి ఆ వార్తవింటూనే పొలమరించి ఉక్కిరి బిక్కిరయ్యాడు.

"ఒరేయ్ మంచినీళ్లు" తాను కూర్చున్నచోటు నుంచి లేవకుండానే కేకవేశాడు లక్ష్మణ్.

మగ్ పట్టుకొని పరుగెత్తాడు స్వామి.

కాని పంపులలో నించి ఒక్క నీటి చుక్కకూడా రాలలేదు. మొహం వ్రేళ్ళాడేసుకొని వచ్చి అదే విష

యం చెప్పాడు. ఫుడ్ షాక్‌నుంచి తేరుకొన్న వెంకటపతి, స్వామి చెప్పిన విషయం విని. "ఒరేయ్ ఇది హాస్టల్‌లా లేదు. పెద్ద బూత్ బంగళాలావుంది. తిండిలేదు, తిప్పలు లేవు. ఆఖరికి గొంతు తడుపుకోవడానికి మంచినీళ్ళు కూడా లేవు. ఇక్కడ చచ్చినా దిక్కులేదు. వెంటనే పోదాం" అన్నాడు.

"పోదాం, పోదాం అంటావు. ఎక్కడికెళ్దాం?" అడిగాడు సత్తిరాజు.

"బావకివ్వమని చెప్పి వాళ్ళింటిదగ్గర ఏవో ఇచ్చారు. అవి ఇచ్చి అక్కడేవుండి పోదాం"

"సరే, అంతకంటే మార్గమేముంది?" అంటూ లేచాడు సత్తిరాజు. మిగతా వారు అనుసరించారు.

"ఒరేయ్, మధు రూములో లేడనుకో... ఒకవేళ గదిలో వున్నా పరీక్షలు గనక వీలుకాదన్నాడనుకో. ఏం చేద్దాం" మార్గమధ్యంలో ధర్మసందేహాన్ని వెలిబుచ్చాడు స్వామి. అదీ ఆలోచించాల్సిన పాయింటే! అనుకొన్నారు. కాని మరో మార్గం ఎవరికీ తోచలేదు.

మౌనంగా నడక సాగిస్తున్నారు, ఉన్నట్టుండి హఠాత్తుగా అన్నాడు లక్ష్మణ్ "అరేయ్, రఘు తెలుసుకదా! వాడింట్లోవాడు మినహా ఇంకెవరూ ఉండరట. ఒకసారి వాళ్ళింటికి రమ్మని అన్నాడు కూడా!" అని.

"అయితే వెళ్ళావా?" తనకు తెలియకుండా తన రూమ్‌మేట్ ఎప్పుడు వెళ్ళాడా! అన్న అనుమానంతో అడిగాడు వెంకటపతి.

"లేదు"

"మరయితే మధుకి ఈ డబ్బా ఇచ్చి ముందువాడి ఇల్లెక్కడో వెదుకుదాం. దొరక్కపోతే, అప్పుడే మధు గదిలో సెటిలవుదాం" అన్నాడు సత్తిరాజు.

అంతా 'సరే' అనుకున్నారు.

వారు మధు గదికి వెళ్ళేసరికి, గది తలుపులు దగ్గర కేసి వున్నాయి. మిగతా గదులన్నిటికీ బయట తాళాలు వ్రేలాడుతున్నాయి.

చొరవగా గదిలోకి ప్రవేశించారు. కాని గదిలో ఎవరూ లేరు.

"మీరంతా కూర్చోండి. బావని పిలుచుకొస్తాను" అంటూ బాత్ రూమ్ వైపు వెళ్ళాడు. అక్కడా లేడు. 'ఎక్కడున్నాడబ్బా' అని ఆలోచిస్తున్న వెంకటపతికి 'డాబా మీదున్నాడా' అన్న అనుమానం వచ్చింది. మెల్లగా డాబా పైకి చేరుకొన్నాడు.

పెరటి వైపున్న పిట్టగోడ దగ్గర నిల్చొని. ఎదురింట్లో వంట ఇంటివద్ద నిల్చునున్న సుందరాంగి వైపే దృష్టిని నిలిపి గాలిలో ముద్దులు విసురుతున్న వేడిముద్దుల్ని వాలు చూపుల్ని రిసీవ్ చేసుకుంటున్న ఆ మోహనాంగి గణాచారిలా పెంచిన జుట్టుతో, గుమ్మడి కాయంతబొజ్జతో, పొట్టిగా, లావుగా వున్న ఒక వింత వ్యక్తి పైకి రావడంతో లేడిపిల్లలా చెంగున దుముకుతూ ఇంట్లోకి వెళ్ళింది.

అంత హఠాత్తుగా ఎందుకు వెళ్ళిందా? అని ఎంతో ఉత్సుకతతో చూస్తున్న మధు. "బావా! ఆ అమ్మాయి ఎవరు? అన్న పిలుపుతో ఉలిక్కిపడి వెనుదిరిగి చూశాడు.

యమకింకరుడిలా నిలబడున్నాడు వెంకటపతి.

"ఎంతసేపయిందిరా వచ్చి?"

"ఇప్పుడే వచ్చాను. నేను రాగానే ఆ ఎదురింట్లో అమ్మాయి లోపలికి వెళ్ళిపోయింది"

"ఛ వెధవ! అసలు నీకు కాలేజీ లేదుగా, అప్పుడే ఎందుకొచ్చావ్?"

"... ..." తెల్ల మొహమేసుకుని చూస్తుండిపోయాడు.

"వచ్చావే అనుకో, క్రిందనుంచే కేకవేస్తే నేను దిగి వచ్చేవాడ్నిగదా! నీవెందుకు పైకి వచ్చావు?"

ఏడుపు ఒక్కటే తక్కువయింది వెంకటపతికి.

"అలా ముంగిలా చూస్తావేమిట్రా?"

"నీకివ్వమని ఒక డబ్బా ఇచ్చారు. ఇద్దామని మా వాళ్ళతో వచ్చాను. నీవు కనిపించకపోయేసరికి వాళ్ళందర్నీ గదిలో కూర్చోబెట్టి నేనొక్కడ్నే పైకి వచ్చాను" అన్నాడు సంజాయిషీగా.

"బ్రతికించావ్" అని, "సరే, ఆ డబ్బా ఏదో అక్కడపెట్టి వెళ్ళు" అన్నాడు

"అలాగే" అన్నట్టుగా తలూపి బయలుదేరాడు వెంకటపతి.

"ఏమిట్రా అలా వున్నావ్" అనడిగాడు సత్తిరాజు, ఏడుపుమొహంతో గదిలోకి వచ్చిన వెంకటపతిని.

"ఏమీలేదులే" అని, "రఘు ఇంటికిపోదాం పదండి" అన్నాడు. అంతా బయలుదేరారు.

వెంకటపతి మౌనముద్ర కావడంతో "ఏం జరిగింది" మెల్లగా అడిగాడు లక్ష్మణ్.

"ఏంకాలేదు" అన్నట్టుగా తలూపాడు.

"అదోలా వున్నావు. ఏంజరిగిందో స్నేహితులమయిన మాతో చెప్పకపోవడం అన్యాయం" అన్నాడు లక్ష్మణ్.

కర్చీఫ్‌తో కళ్ళొత్తుకున్నాడు వెంకటపతి.

"ఏమయిందిరా" ఆదుర్దాగా అడిగాడు సత్తిరాజు.

కాని వెంకటపతి మౌనం విడిచిపెట్టలేదు.

"చెప్పకపోతే నామీద ఒట్టే" బెదిరించాడు లక్ష్మణ్.

"చెప్తానురా, మీకు చెప్పకపోతే ఇంకెవరికి చెప్తాను" అని, "నేను పైకి వెళ్ళానా. అప్పుడేమో బావ ఎదురింటి అమ్మాయికేసి చెయ్యూపుతున్నాడు. ఆ అమ్మాయేమో

బావని చూసి నవ్వుతోంది, ఆ అమ్మాయి. నన్ను చూసి లోపలికి పరుగెత్తింది. అందుకు బావకి కోపం వచ్చి "అసలెందుకు వచ్చావ్ అని తిట్టాడు" చెప్పాడు.

"ఓస్ ఇదేనా" అవి. ఆ అమ్మాయి ఎవరో కాదు మీ అక్క. మరి బావ - అక్క ఏదో మాట్లాడుకుంటుంటే ఎవరైనా వెళ్తారా?" నవ్వుతూ అడిగాడు సత్తిరాజు.

"ఏమిట్రా నువ్వనేది" వెంకటపతికి కోపంవచ్చింది.

"కోప్పడకురా బాబు... మీ బావ ఆ అమ్మాయిని ప్రేమిస్తున్నాడు. పానకంలో పుడకలా వారిద్దరి మధ్యకు వెళ్ళి వాళ్ళ ఆనందాన్ని పాడు చేశావ్. అదీ కథ" విడమర్చాడు సత్తి.

"ఛీ పాడు? ఏమిటా మాటలు:" అంతా నవ్వుకున్నారు వెంకటపతి మాటలకు.

సూర్యుడు పడమటి కనుమలలో వాలిపోతున్నాడు. అంతటా నీరెండ పరచుకొనుంది.

ఎలాగయితేనేం రఘు ఇంటికి చేరుకోగలిగారు. రెల్లుగడ్డిలో వేసిప్పింది రఘు ఇల్లు.

ఆ ఇంటిముందు రకరకాల పూలమొక్కలు బారులు తీరి వున్నాయి. ,పూల గుత్తుల భారానికి ఆ మొక్కలు తలల్ని భారంగా వాల్చాయి. ఆ పూల పరిమళాలు గాలి వీచినప్పుడల్లా నలు దిక్కులకు వ్యాపిస్తున్నాయి.

ఆ మొక్కల మధ్య ఒక చిన్న టీపాయ్ వుంది, దాని మీద 'టీ' కెటిల్, బిస్కట్స్ వున్న ప్లేటు వున్నాయి. టీపాయ్‌కి ఎదురుగావున్న కుర్చీలో తెల్లని, పైజామా, లాల్చీ ధరించిన ఆరడుగుల సన్నని విగ్రహం ఒకటికూర్చున్నది.

అతడి చేతిలోని పుస్తకం పేజీలు తిరుగుతున్నాయి. తల స్నానం చేసినట్టున్నాడు తల వెంట్రుకలు నుదుటిపై పడి అల్లరి పెడుతున్నాయి.

అంతలో గేటు చప్పుడు వినిపించడంతో పుస్తకం నుంచి తలెత్తి చూశాడు.

నోటిలోని ఉమ్మిని బుడగలుగా గాలిలోకి వదులున్న రాధాగోపాలకృష్ణస్వామి, నల్లగా సన్నగా పొట్టిగా తలమీద వెంట్రుకలు నుదుటి మీదకు దువ్వుకొని కార్టూన్ ఫిగర్లా వున్న సత్తిరాజు, లావుగా, నల్లగా, పొట్టిగా పహిల్వాన్‌లా వున్న వెంకటపతి, పొట్టిగా, సన్నగా కొళ్ళను మార్క్సులా వున్న లక్ష్మణ్ కనిపించారు.

"రండి, రండి" అంటూ ఎదురెళ్ళి ఆహ్వానించాడు రఘు.

"గురూ! మీ గార్డెను చాలా బాగుంది" కాంప్లిమెంటు ఇచ్చాడు లక్ష్మణ్.

"థాంక్యూ"

"మొక్కలు పెంచడం నీ హాబీనా" అడిగాడు స్వామి.

"కాదు జీవనాధారం!"

అర్థంగాక చూశారు.

"తర్వాతచెప్తాను. ముందు లోపలికి రండి"అంటూ 'టీ' కెటిల్, బిస్కట్ ప్లేటు తీసికొని లోపలికి దారితీశాడు

చిన్న వసారా.

లోపల పెద్దహాలు

దానిని ఆనుకోని రెండు చిన్న గదులు. ఒకటి_కిచెన్-రూము, రెండవది_బెడ్ రూము.

ఆ హాలులో మధ్యన మూడు షెల్ఫ్‌లు వున్నాయి. వాటినిండా పుస్తకాలున్నాయి. వాటిని ఆనుకొని ఒక టేబుల్ వుంది. ఆ టేబుల్‌కి ఒక ప్రక్క ఈజీ చెయిర్. మరో ప్రక్క మినీ షెల్ఫ్‌లు వున్నాయి. ఆ టేబుల్ ముందు ఒక కుర్చీ వుంది.

"కూర్చోండి" అంటూ హాలులో ఒక ప్రక్కగా వున్న సోఫా చూపించాడు.

మౌనంగా కూర్చున్నారు.

"రెండు నిమిషాలు" వంట ఇంట్లోకి దారితీశాడు రఘు. ఆ సోఫా ముందున్న టిపాయ్ మీద రకరకాల మ్యాగజైన్సు వున్నాయి.

స్వామి, సత్తిరాజు, వెంకటపతి ఆ మ్యాగజైన్సు తిరగేస్తుంటే లక్ష్మణ్ చొరవగా రఘు టేబుల్ దగ్గర కెళ్లాడు. ఆ టేబుల్ గ్లాసు క్రింద ఒక గ్రీటింగు కార్డు వుంది.

'డియర్ రఘు !' అని సంబోదించిన ఆమె—

"హార్టు టు హార్టు
దో మైల్స్ ఎ పార్టు
మై లవ్ టు యు
విల్ నెవర్ డిపార్టు"

అని తన హృదయంలోని భావాల్ని మాటల రూపంలో పొదిగింది. క్రింద "కుసుమ" అని సంతకం చేసింది.

ఎవరీ కుసుమ?

రఘు ఎందుకు దీనినే ఇంత పదిలంగా, అదీ నిత్యం తాను చదువుకునే-వ్రాసుకునే టేబుల్ గ్లాసు క్రింద పెట్టాడు అనుకున్నాడు లక్ష్మణ్.

అంతలో "లక్ష్మణ్ !" అన్న కేక విని వెనుదిరి గాడు. బిస్కట్లు టీపాయ్ మీదుంచి, కప్పులతో టీ సర్వ్ చేస్తున్నాడు రఘు.

మెల్లగా వెళ్ళి ముగురి సరసన కూర్చున్నాడు లక్ష్మణ్.

"మీరిలా నా ఆతిధ్యం స్వీకరించడం నాకు చాల సంతోషంగా వుంది" అన్నాడు రఘు.

"రెల్లుగడ్డితో నేసినా ఈ ఇల్లు చాలా చూడముచ్చ టగా వుంది. ఏ చిత్రకారుడో రూపకల్పన చేసినట్టు ఇంటి

ముందు రకరకాల పూలమొక్కలు, ఇంట్లో పొందికగా అమర్చిన పుస్తకాలు– మమ్మల్ని ఏదో ప్రపంచానికి తీసుకెళుతున్నాయి" అన్నాడు స్వామి.

"అవునూ! ఈ ఇంట్లో నీవు తప్ప మరెవరూ లేరా?"

"ప్రస్తుతానికి నేనొక్కడ్నే''

"అదేమిటి, అసలు నీకు "నా" అంటూ ఎవరూ లేరా?"

"వున్నారు. కాని ఎక్కడున్నారో తెలియదు"

"అయితే కుసుమ ఎవరు?"

ఆ ప్రశ్నకు చెంపదెబ్బ తిన్నవాడిలా దిగున తలెత్తి చూశాడు. రెండు నిమిషాలు వారి మధ్య మాటలే కరువయ్యాయి. ఆ మౌనాన్ని భంగపరుస్తూ, "కుసుమ నా ప్రాణం" అన్న రఘు మాటలు వినిపించాయి.

"అంటే ఆమె నీకు..." అంటూ అర్థోక్తితో ఆగిపోయినవాడ్ని.

"లక్ష్మణ్! అని పిలిచి," ఆ గ్రీటింగు కార్డుపైన గోపికాలోలుడున్నాడు. దిగువ భాగాన బాపు కుంచెనుంచి ప్రాణం పోసుకున్న పద్దెనిమిదేళ్ళ జవరాలు చెక్కిలికి చేతిని చేర్చి క్షణమొక యుగంగా గడుపుతున్నట్లుంది. బాపు బొమ్మలో చెప్పిన దానిని, మధుర కవి నారాయణరెడ్డి.

రాదేమి నా ప్రియుడు, రాయిగా మారెనా?
కబురంపు మనసుంటె, గాలి కరువాయెనా?

అవి క్లుప్తంగా చరణాలలో తెలియజేశారు.

ఒక గ్రీటింగు కార్డు పంపే ముందు భావుకులయిన వారెవరయినా తాను చెప్పదలచుకున్న భావాలకు దగ్గరగా వున్న ఆర్టుని ఎన్నుకుంటారు. ఇప్పుడు ఆమె నాకేమవుతుందో గ్రహించడం కష్టం కాదనుకుంటాను" అన్నాడు.

"రఘు ! నీవు కథలెందుకు వ్రాయకూడదు? నీవే గనక రచనా వ్యాసంగాన్ని చేపడితే మంచి రచయితవవుతావు" అన్నాడు స్వామి.

నవ్వి, "నా కిష్టంలేదు" అన్నాడు.

"ఎందుకని?"

"వివాహం చేసుకొని ఆమె ఎక్కడో ప్రశాంతంగా కాలం గడుపుతోంది. తిరిగి కథా రచయితగా ఆమె ముందు సాక్షాత్కరించి ఆమె ప్రశాంత జీవితంలో కల్లోలాన్ని సృష్టించలేను"

"ఆమెకు పెళ్ళయిందని తెలిసి, ఇంకా ఆరాధిస్తున్నావా?"

"వివాహ బంధమైన ప్రేమకంటే మానసిక ప్రేమే గొప్పది. ఆ ప్రేమ వివాహమైనా, విఫలమైనా మాసిపోనిది. మధురమయినది" అని. ఈ సంభాషణ ఇక ఆపుచేస్తే బావుణ్ణు అన్నట్టుగా బాధగా కళ్ళు మూసుకున్నాడు.

"మీరు..." అని వెంకటపతి ఏదో అనబోతుండగా, "వద్దు" అన్నట్టుగా స్వామి చెయ్యి అడ్డు పెట్టడంలో ఆగిపోయాడు,

ఐదు నిమిషాలవరకూ రఘు ఆ మూడ్‌నుంచి తేరుకోలేదు. అప్పటివరకు "అరెయ్...ఒరెయ్" అని ఏ రఘునయితే అడ్రస్ చేశాడో, ఆ రఘుని అలాగే అడ్రస్ చేయడానికి లక్ష్మణ అంతరంగం అంగీకరించలేదు.

"రఘు ! కాలేజీ తెరిచేవరకూ నిన్ను బాధ పెట్టక తప్పటంలేదు, అభ్యంతరమా?" అడిగాడు సత్తిరాజు,

"సత్తిరాజు ! నన్ను కన్నవారు, నా తోబుట్టువులు అంటు ఆర్ధికంగాను, ఇటు సాంఘికంగాను ఉన్నత స్థితిలో వున్నారు. జీవితంలో నేను ఎన్నడూ ఎవర్ని ఏదీ కావాలని కోరలేదు. నేను కోరుకున్నది ఒకే ఒక వ్యక్తిని ఆమె

నా దగ్గరకు వచ్చి "రఘు ! మా వాళ్ళు నాకు సంబంధాలు చూస్తున్నారు. ఆలస్యం చేస్తే నా బ్రతుకు మరొకరితో ముడిపడుతుంది. ఇప్పుడే నన్ను పెళ్ళి చేసుకో!" అనడిగింది. ఆ క్షణాన నా వారెవరూ నన్ను ఆదుకోలేదు. పరిస్థితులను సవాల్‌గా తీసుకొని ధైర్యంగా ఆమెను నా దానిని చేసుకోలేక, పిరికివాడినయి పారిపోయి వచ్చాను. ఈ చిన్న గుండెనిండా నిండిపోయిన ఆ దేవత మినహా నాకింకెవరున్నారు? చుట్టరికాన్ని మించిందంటారు స్నేహం. మన స్నేహం కలకాలం నిలవాలనే నేను కోరుకుంటు న్నాను" అన్నాడు గాద్గదిక స్వరంతో "థాంక్యూ" అని, ఈ రోజంతా ఇలాగే ఇక్కడే గడిచిపోవాలా?" అడిగాడు సత్తిరాజు.

"ఓ. కె. అయితే"

"మీఇష్టం. ఎక్కడికయినా వెళ్దాం అంటే నేనూ వస్తాను"

"అయితే దుర్గగుడికి వెళదాం"

"అలాగే...అయితే వంటపని పూర్తిచేసి మరీవెళదాం"

"నీకు వంటపని కూడా వచ్చా?"

"స్త్రీలే వంట చేయాలి అనే రోజులు పోయాయి" అంటూ వంట ఇంటిలోకి వెళ్ళాడు.

మరో ముప్పావుగంటలో వంటపని పూర్తిచేసి దుర్గ గుడికి బయలుదేరారు.

"బస్‌లో వెళదామా? లేక నడిచిపోదామా ?" అడి గాడు రఘు.

"బస్‌లో వెళితే థ్రిల్ ఏముంది? నడిచేపోదాం!" అన్నాడు స్వామి.

"అమ్మో! నేను మాత్రం ఎక్కువదూరం నడవ లేను"– వెంకటపతి.

"భయపడకు గుడివరకు ఆటోలో వెళ్దాం. అక్కడి నుంచి ఘాట్ రోడ్డున నడిచి వెళ్దాం" అని ఆటోలను పిలిచాడు. రెండు ఆటోలలో పావుగంట ప్రయాణంచేసి, ఘాట్ రోడ్డు చేరుకున్నారు.

తొలిసారిగా కొండ ఎక్కుతున్న వెంకటపతికి కాలు జారితే గోళీలా క్రిందకు దొర్లుకుంటూ పోతానేమోనన్న అనుమానం వచ్చింది. వెంటనే రఘు చెయ్యిపట్టుకున్నాడు. మెల్లగా మూడు కాళ్ళ ముసలిలా ఆయాసపడుతూ కొండ పైకి చేరుకొన్నాడు.

దేవి స్పెషల్ దర్శనం కొరకు అంతా టికెట్లు కొంటుంటే, తనకు మాత్రం టికెట్ వద్దన్నాడు రఘు.

"ఏం, నీకు టికెట్ పుచ్చుకోరా" అనడిగిన వెంకటపతికి, "నేను అమ్మవారి దర్శనానికి రావడంలేదు. అదుగో ఆ చీకటి కోనేరు దగ్గర కూర్చునుంటాను, మీరు దర్శనం చేసుకొని అక్కడికి రండి" అని సమాధానం కొరకయినా ఎదురు చూడకుండా వెళ్ళాడు.

చీకటికోనేటికి సమీపంలో ఒక పారిజాతం చెట్టుంది. ఆ చెట్టుకి దగ్గర్లోవున్న సమతల ప్రదేశంపై కూర్చొని అప్రయత్నంగా ఆకాశంవైపు చూశాడు రఘు. ఆకాశాన పిండారబోసినట్లుంది. గతంలోకి జారిపోయాడు.

అమ్మవారి దర్శనం చేసుకొని బయటకు వచ్చిన తర్వాత రఘుని అడిగింది కుసుమ: "అమ్మవార్ని ఏమని కోరుకున్నావు" అని.

"మేమిద్దరం పసుపు దుస్తులతో నిన్ను దర్శనం చేసుకొనే భాగ్యాన్ని ప్రసాదించు అని వేడుకొన్నాను" అని, "మరి నీవేమని దణ్ణం పెట్టుకున్నావ్" అడిగాడు.

"నా రఘుకి ఉజ్వలమయిన భవిష్యత్తుని ప్రసాదించమన్నాను"

"అదేమిటి కుసుమా! ప్రేమికులు పెళ్ళి కావాలని కోరుకుంటారుగాని..."

"రఘు" అన్నట్లుగా కనురెప్పలెత్తి చూసి, "ఈ బొందిలో ప్రాణం వుండగా ఎవరు కాదన్నా మన పెళ్ళి జరిగితీరుతుంది. నాకా నమ్మకం వుంది" అన్నది

"నాకు తెలుసు కుసుమా! నీవు తలచుకుంటే దేనినయినా సాధిస్తావు" అని, "అదిగో అక్కడ చెట్టుక్రింద కూర్చుందాం పద" అంటూ దారితీశాడు.

పారిజాతం చెట్టుక్రింద పూలు గుట్టగా పడున్నాయి. ఆ చెట్టుకి సమీపంలో వున్న చదునయిన ప్రదేశంలో కూర్చున్నా రిద్దరూ.

"రఘూ! నా నుదుట తిలకం దిద్దు" అంటూ పూజారి ఇచ్చిన కుంకుమ పొట్లాం అందించింది.

"కుసుమ! ఈ తల్లి సత్యవంతురాలంటారు. ఈమె నిజంగా సత్యవంతురాలయితే నీ నుదుట కుంకుమను నేనే" అంటూ ఆమె నుదుట బొట్టుపెట్టాడు.

భారంగా ఆమె కనురెప్పలు వాలిపోయాయి.

"కుసుమా!" అంటూ ఆమె ముఖాన్ని తన చేతుల్లోకి తీసికొని తన వైపుకి తిప్పుకున్నాడు.

ఆమె సోగకళ్ళు తృప్తిగా చూస్తున్నాయి.

"కుసుమ! నీ కళ్ళు చిలిపి కళ్ళు- దొండపళ్ళు. కళ్ళతోనే కట్టిపడేయటమంటే ఏమిటో నీ కళ్ళని చూసే తెలుసుకున్నాను."

ఆమె బుగ్గలపై అప్పటివరకు అస్పష్టంగా వున్న చొట్టలు అతడి మాటలకు ప్రస్ఫుటమాయ్యాయి.

"కుసుమ! ఈ సొట్టబుగ్గల్ని చూస్తుంటే నా వళ్ళు జవజవ లాడుతున్నాయి."

అతడి మాటలకు ప్రతిగా కిలాకిలా నవ్వింది.

కాని, అంతలోనే రఘు లేచి వెళ్ళడంతో ఆమె పెదవులపై మెరుస్తున్న చిలిపి నవ్వు అదృశ్యమయింది.

కాని, దోసిట పారిజాతాలు నింపుకొని అతడు తనవైపు రావడంలో అతడి ఉద్దేశ్యాని గ్రహించి సిగ్గు మొగ్గయింది.

ఆ నిండు పౌర్ణమి రాత్రి పాలవంటి తెల్లనయిన చీర ధరించి, అప్పుడే వికసించిన కలువలా వున్న పాదాలపై పారిజాతాలు వెదజల్లాడు.

"ఏయ్, ఏమిటీ పిచ్చిపని" చిరుకోపాన్ని ప్రదర్శించింది. "ఇది పిచ్చిపని కాదు కుసుమ, దేవీపూజ రాత్రి నాకొక కమ్మని కల వచ్చింది. ఆ కలలో సోగ కళ్ళతో, సొట్ట బుగ్గలతో ఒక చిన్నారి సాక్షాత్కరించింది. గుండ్రని పిరుదులపై నల్లని ఆమె వాలుజడ నాట్యమాడుతుంటే నా గుండె లయ తప్పింది. కోకిలకే పాఠాలు చెప్పగల ఆమె కేవలం గాయిని మాత్రమే కాదు; నాట్యగత్తె కూడా!. అప్పుడు నేను దుర్గామాతని ప్రార్థించి తల్లీ ఈ సుందరాంగిని నా అర్ధాంగిగా ప్రసాదించు అని వేడుకొన్నాను. కలలోని దేవత ఇలలో నా ఆరాధ్యదేవతగా ప్రత్యక్షమయింది. అందుకే ఈ భక్తుడు ఇలా ఈ దేవిని కొలుస్తున్నాడు."

"అబ్బాయిగారికి పైత్యం ఎక్కువై కవిత్వం పలుకుతోంది. ఇహ దెబ్బలు పడవలసిందే !"

"చిత్తం దేవీ, కానీ ఓ చిన్న రిక్వెస్టు"

"ఏమిటి భక్తా అది"

"ఆ కొట్టేదేదో మీ వాలుజడతో కొట్టండి"

"పో దొంగా" అంటూ బోలెడంత సిగ్గుపడిపోయింది.

"కుసుమ" అంటూ ఆమెను దగ్గరకు తీసుకున్నాడు. గువ్వలా అతని కౌగిట్లో ఒదిగిపోయింది.

ఒక ప్రక్కనుంచి కృష్ణానదీ తరంగాల మీద నుంచి వీస్తున్న చల్లని వాయు తరంగాలు పారిజాతాల ఘుమ ఘుమల్ని తమలో ఇముడ్చుకొని గాఢ పరిష్వంగంలో మునిగివున్న ఆ జంటని తాకుతున్నాయి. మరొక ప్రక్క నుంచి దేవీ ఆలయంలోని గంటల మ్రోతలు అంతటా ప్రతిధ్వనిస్తున్నాయి. ఇంకొక ప్రక్క పెళ్ళివారిల్లులా విజయవాడ పట్టణం రంగు రంగుల దీపాలతో దేదీప్య మానంగా వెలిగిపోతోంది.

కాని ఆ జంట పరిసరాల్నే మరిచిపోయింది.

అంతలో "రఘూ ! రఘూ" అని ఎవరో తట్టి పిలిచినట్లుంటే కళ్ళు తెరచి చూశాడు. అక్కడ పారిజా తాలుగాని, కుసుమగాని కనిపించలేదు. వెంకటపతి, లక్ష్మణ్ సత్తిరాజు, స్వామి నిలబడున్నారు.

జ్ఞాపకాలు ఎంత మధురంగా వున్నాయి అను కుంటూ లేచాడు.

"ఏమిటి ఇంతలోనేఅంత మత్తు నిద్ర పట్టేసిందా?" అడిగాడు లక్ష్మణ్.

సమాధానం భావగర్భితంగా నవ్వాడు.

ఇంటివైపు తిరుగు ముఖం పట్టారు.

* * *

పడుకున్నాడన్న మాటేగాని, వెంకటపతి కళ్ళ మీదకు కునుకు తొంగి చూడలేదు.

సాయంత్రం డాబా మీదనుంచి చెయ్యి ఊపుతున్న మధు, సమాధానంగా నవ్వుతున్న ఆమె - ఆ దృశ్యమే వెంకటపతి కళ్ళలో మెదలసాగింది.

"ప్రేమించడానికి అమ్మాయి ఎలా దొరుకుతుంది ? ప్రేమించడం ఎలా ప్రారంభించాలి ? ప్రేమించడం తప్పు

కాదా !" ఇత్యాది ప్రశ్నలు కుమ్మరి పురుగులా వెంకటపతి హృదయాన్ని తొలచసాగాయి.

అఫ్టరాల్ పొట్లకాయంతా సన్నగా వుండే ఈ రఘు గాడు ఒక అమ్మాయిని ప్రేమించాడు. పై పెచ్చు మధు బావకూడా వెనక ఇంటి అమ్మాయిని ప్రేమిస్తున్నాడు. అసలు కాలేజీలోకి అడుగు పెట్టిన తర్వాత తప్పనిసరిగా ప్రేమించి తీరాలా ? అలాగయితే సత్తిరాజు, లక్ష్మణ్, స్వామి ప్రేమించరేమిటి ? - సమాధానం దొరకని ప్రశ్నల పరంపరల మధ్య నిద్రలోకి జారిపోయాడు వెంకటపతి.

ఆ విధంగా నిద్రపోయిన వెంకటపతి అలవాటు ప్రకారం తెల్లవారుఝామునే లేచాడు. లక్ష్మణ్, సత్తిరాజు, స్వామి నిద్రపోతున్నారు గాని రఘు మంచం ఖాళీగా వుంది.

"ఎక్కడికెళ్ళాడబ్బా" అనుకొంటూ ఇంటిముందుకి వచ్చినవాడికి పూలు కోస్తున్న రఘు కనిపించాడు.

'అరె. ఎందుకు పూలన్నీ కోస్తున్నావ్' అని అడిగాడు.

"వెంకట్ ! ఈ ఇంటిముందున్న పూలమొక్కలు, వెనుకనున్న కాయగూరల మొక్కలే నా జీవనాధారం. నిత్యంపూలు, కాయలుకోసి మార్కెట్‌లో ఇచ్చి వస్తాను. అధమం పది రూపాయలయినా వస్తాయి. అప్పుడప్పుడు మొక్కలుకూడా కొనడానికి వస్తారు. కొందరికి మొక్కలు పెంచడం హాబీ. కాని నాకు జీవనాధారం" అని "అవునూ ఇంత చీకటితో నీ వొక్కడివే లేచావేమేటి" అడిగాడు.

"ఏం లేదు, నిన్నొక ప్రశ్న అడుగుదామని"

"ఏమిటో అది !"

"నీవు ఎవరో అమ్మాయిని ప్రేమించానన్నావు గదా! అలాగే ఈవేళ మా మధు బావకూడా ఒక అమ్మాయిని ప్రేమించడం చూశాను. అసలు ప్రేమించడం తప్పుకాదా?

తృటికాలంపాటు వెంకటపతి ముఖంలోకి పరిశీలనగా చూసి అన్నాడు—"వెంకటపతి! అందమయిన అబ్బాయి గాని, అమ్మాయిగాని కనిపించగానే అప్రయత్నంగా ఒక సారి చూస్తాం. అది మానవ నైజం. చంద్రుడిన్ని చూడ గానే కలువ ఎలా వికసిస్తుందో అలాగే యవ్వనంలో వున్న యువతీ యువకులు తారసపడినప్పుడు పరస్పర ఆకర్షణలో పడటం సహజం. కాకపోతే ఇక్కడ "లవ్" అని "లస్ట్" అని రెండు వున్నాయి.

"లవ్ ఎట్ ఫస్ట్ సైట్" అని తరచుగా మనం వింటాం. నా అభిప్రాయం ప్రకారం ఫస్ట్ సైట్‌లో ఏర్పడేది "లవ్" కాదు 'లస్ట్' ఫిజికల్ "అప్పియరెన్సుని చూసి లైక్ చేస్తారు. అంటే దానికి 'లవ్' అని పేరు పెట్టేకంటే 'లస్ట్' అని పేరు పెట్టడం సమంజసం. తరచుగా పెళ్ళిచూపుల పేరుతో అమ్మాయిలు - అబ్బాయిలు ఒకరినొకరు చూసుకోవడం పెళ్ళికి అంగీకరించడం జరుగుతుంది. ఆ స్వల్ప వ్యవధిలో వారు చూసేది ఫిజికల్ అప్పిరియరెన్సు మాత్రమే! ఒకరి అభిరుచుల్ని, అభిప్రాయాల్ని మరొకరు అర్థం చేసుకోవడా నికి అవకాశం తక్కువ. ఒకవేళ ఒకర్నొకరు ప్రశ్నించడం సమాధానాలు చెప్పడం జరిగినా, ఆ సమాధానాలు ప్రశ్న లను బట్టి వుంటాయిగాని పరిస్థితుల్ని మనస్తత్వాన్ని బట్టి కాదు. అందువల్ల పెళ్ళిచూపులు పేరుతో అమ్మాయిలు- అబ్బాయిలు చూసుకొని ఇష్టపడటమనేది ఫిజికల్ అప్పియ రెన్స్ చూసి మోహంలో పడి పెళ్ళికి అంగీకరించడమే అని నా ఉద్దేశం" అని.

"ఇంతకీ లవ్ చేయడం తప్పా? ఒప్పా?"

"భార్య అంటే జీవితమనే నావకి చుక్కాని. అంగట్లో కూరగాయల్ని చూసి బేరమాడి కొన్నట్లు పెళ్ళి చూపుల్లో చూసి మూడు ముళ్ళు వేసేకంటే నీ అభిప్రాయా

లతో ఏకీభవించే వ్యక్తిని, నిన్ను అర్థం చేసుకొనే వ్యక్తిని నీ జీవిత భాగస్వామినిగా ఎన్నుకోవడం ఎవరూ తప్పనరు"

"అయితే రేపట్నుంచి నేనూ ప్రేమించడం ప్రారంభిస్తాను"

"ఎవర్ని ?"

"అదే తేలలేదు."

నవ్వి. "వెంకటపతి! ప్రేమించడానికి ఒక అమ్మాయి కావాలి. అనేక అమ్మాయిల వెంటపడటం ప్రేమించడ మనిపించుకోదు. జులాయి తన మనిపించుకొంటుంది" అన్నాడు

"అన్నిటికీ అస్సు చెప్తున్నావ్. మరి అమ్మాయిలతో పరిచయమయ్యే దెలా !"

'ఎంత అమాయకుడవయ్యా. వెంకటపతి' అనుకొని. "ఏ వ్యక్తితోనూ ప్రేమించడం కోసం పరిచయం చేసుకోకు. జీవితంలోని అనేక వ్యాపకాలలో అనేక మంది మనకు తారసపడతారు వారిని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించు. ఆమెతో జీవితాన్ని సుఖమయం చేసు గలననిపించినప్పుడు, ఆమె అభిప్రాయాల్ని ఎప్పుడు గౌరవిస్తావో - ఆమె వ్యక్తిత్వానికి ఎప్పుడు విలువ ఇస్తావో అప్పుడే ఆమెకూడా నిన్ను అర్థం చేసుకుంటే, మీ మధ్య ప్రేమ అంకురిస్తుంది" అన్నాడు.

"మీరు కుసుమని అలాగే ప్రేమించారా ?"

"కొందరికి కొందరితో మొదట ముఖాముఖీ పరిచయ మేర్పడుతుంది. మరి కొందరిలో ఉత్తరాల ద్వారా పరిచయ మేర్పడుతుంది. మొదట వర్గంలో ముందు శారీరకంగా ఆకర్షణకు లోనయి అభిప్రాయాలు కలవడంతో ఒకటవుతారు. రెండవ వర్గంలో అభిప్రాయాలు కలిసిన తర్వాత ఒకరి కొకరు ఎదురు పడటం, శారీరకంగాకూడా

ఆకర్షణకు లోనయి ఒకటి కావడం జరుగుతుంది.నా శంలో రెండవది ఉత్తమమైనది. రెండవ మార్గాన్ని అనుసరించే అదృష్టం నాకు లభించింది"

"కాని మీ రామెను పెళ్ళి చెసుకోలేదుగా !"

రఘు నవనాడులు కృంగిపోయాయి.

అంతటి చల్లని వాతావరణంలోనూ రెండు వేడి కన్నీటి చుక్కలు చెక్కిళ్ళ మీదగా జారాయి.

"ఏమిటి ఏడుస్తున్నావా ?"

"వెంకటపతి! నేను పిరికివాణ్ని. కుసుమని ప్రేమించి, ఆమె పెళ్ళిపీటలమీద బలిపశువు కాబోతుంటే, రఘు నన్ను ఎక్కడికయినా తీసికెళ్ళు అని ప్రాణితో నా దగ్గరకు వచ్చే పిరికివాణ్నయి పారిపోయి వచ్చాను. నా దేవతకు నేను చేసిన ద్రోహానికి ప్రాయశ్చిత్తంగా నిత్యం మానసిక చిత్రవధని అనుభవిస్తున్నాను" అంటూ చేతిలోని కూరగాయల బుట్టని క్రింద పారేసి రెండు చేతుల్లోనూ తల దాచుకొన్నాడు.

"రఘు" ఆందోళన తొణికిసలాడింది వెంకటపతి స్వరంలో.

"వెంకటపతి! దయచేసి నన్ను ఒంటరిగా ఉండనివ్వు" తల ఎత్తకుండానే అన్నాడు.

మారు మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

పది నిమిషాలకుగాని రఘు ఆ స్థితినుంచి, తేరుకోలేదు. "ఛ, ఏమిటిది? మరీ చిన్నపిల్లవాడిలా ఎందుకిలా ప్రవర్తిస్తున్నాను? ఎందుకు గతాన్ని త్రవ్వి అతని ముందుంచాను?" అనుకొన్నాడు. బాధని గుండెల్లోనే దాచుకొని కుమిలిపోయేకంటే ఈ విధంగానయినా ఉపశమనం పొందడమే మేలు అనుకున్నాడు. పూలు,కూరగాయలు తీసుకొని సైకిల్‌మీద మార్కెట్‌కి వెళ్ళాడు.

"దడ దడ" అన్న మ్రోత వినిపించడంతో స
రాజు, లక్ష్మణ్, స్వామి ఉలిక్కిపడి లేచి కూర్చున్నారు.

ఎదురుగా నడుముకి చేతులు చేర్చి నిలబడున్నాడు వెంకటపతి.

"ఈ శుభోదయాన మీ అందరికీ నేనొకవిషయం చెప్పదలుచుకున్నాను" అన్నాడు గంభీరంగా.

"అంటే "ఏమైనా కలగన్నావా" అనుమానంగా అడిగాడు స్వామి.

"నోర్మూయ్" అని, "నేను మగవాడ్ని. అందమయిన అమ్మాయిని చూసి లవ్ చేయబోతున్నాను" అన్నాడు.

ఎదురుగా నిల్చునున్నది వెంకటపతేనా ; అని కళ్ళు నులుపుకొని మరీ చూశాడు సత్తిరాజు.

"ఆ అమ్మాయి ఎవరో మాకూ చూపించరాబాబు" అన్నాడు లక్ష్మణ్.

"ఇంకా అప్పుడే ఎక్కడ? రేపట్నుంచి వెతకాలి"

"నిజమేరా. ఉదయాన్నే గంట మ్రోగగానే లేవాలి. మరో గంట మ్రోగగానే టేబుల్ దగ్గర పుస్తకాలేసుకొని కూర్చోవాలి. ఇంకో గంట కొట్టగానే మగ్ తీసుకొని మెస్‌కి పరుగెత్తాలి, అంతా గంటల జీవితం అయిపోయింది. స్కూలులో వుండగా ట్యూషన్ మాష్టరు బెత్తం పుచ్చుకొని కూర్చోబెట్టి చదివించేవాడు. కాలేజీలో కొచ్చిన తర్వాత వార్డెను గంటతో చదివిస్తున్నాడు. అంతా దరిద్రపు బ్రతుకయిపోయింది" కష్టపడ్డాడు సత్తిరాజు.

"మరి మన కాలేజిలో అంతా అబ్బాయిలేగదా. ప్రేమించటానికి అమ్మాయి లెలా దొరుకుతారు." ధర్మ సందేహం వచ్చింది స్వామికి.

"స్టెల్లా కాలేజినిండా అమ్మాయిలే. గదరా. హాస్టల్ మకాం మార్చి స్టెల్లా కాలేజీ ఎదురుగా బిచానా వేయడమే?" సత్తిరాజు.

"ఒరేయ్ వెంకటపతి! మంచో, చెడో ఏ పనయినా నలుగురం కలిపేచేస్తున్నాం ఇప్పటివరకు. అలాటిది ఇప్పుడు నీవు ఒక్కడివే ఎవరో ఒక అమ్మాయిని ప్రేమిస్తాననడం మిత్రద్రోహంరా!" అన్నాడు లక్ష్మణ్.

"అంటే పాండవులూ మనమంతా ఒకే అమ్మాయిని ప్రేమించాలా?"—స్వామి ప్రశ్న.

"అబ్బె నా వుద్దేశ్యం అది కాదురా, నలుగురం కలిసి పోటీలేకుండా డిమాన్‌స్ట్రేటర్లని పంచుకున్నామా! అలాగే అమ్మాయిల్ని కూడా!"

"లక్ష్మణ్! నీ అయిడియా బాగానే వుందిరా. కాని అర్జంటుగా హాస్టల్ నుంచి నలుగురం బయటపడటమెలా? రూము సంపాదెంచటమెలా? అమ్మాయిల్ని వెతుక్కోవడమెలా?" "వాటి గురించి వర్రీ అవకురా సత్తిరాజు, ముందు మనం లవ్ ఎఫైర్‌లో పడదామనుకొంటే అవన్నీ నేను సెటిల్ చేస్తాగా!"

"మెజారిటీ ఏమంటే నేనూ అదే" అని, "ఏరా, ఇష్టంలేనివాళ్ళు చేతులెత్తండి" అన్నాడు సత్తిరాజు.

నలుగురిలో ఏ ఒక్కడూ చెయి ఎత్తలేదు.

"స్వామీ! ఈ ప్రోబ్లమ్ సాల్వ్‌డ్, ఇహ మిగతా విషయాలన్నీ నీవే చూడాలి"

"సింపుల్" అని, "వార్డెను చూసే విధంగా, మనం ఆయనని చూడనట్టు పోజుపెట్టి సిగరెట్స్ కాలుస్తాం. మామూలేగా— ఈ కాలేజీలో అయినదానికి కానిదానికి ఫైన్ అంటారు. తలా ఒక రూపాయి ఫైన్ కడతాం. తర్వాత మరో రోజు బ్లాక్ లీడరు చూసేలా స్టడీ అవర్‌లో

బాత్‌రూమ్‌లో స్నానం చేద్దాం. గోలచేద్దాం. ఫెన్ వేస్తే కట్టొద్దు. అప్పుడు వాళ్ళే మన సామాను వీధిలోకి విసిరేస్తారు ఇహ తట్ట బుట్ట చంకన పెట్టుకొని చక్కగా చెక్కేద్దాం" అరటిపండు వలిచి చేతిలో పెట్టినట్లుగా చెప్పాడు.

"మరి మన గది సంగతో!" లక్ష్మణ్.

"ఈ తతంగమంతా జరిగేసరికి అధమం వారం పదిరోజులు పడుతుంది ఈ లోపు మనం రూము సంపాదించొచ్చు. అప్పటికీ దొరకలేదూ, ఈ సత్రం వుండనే వుందిగా" అన్నాడు.

స్వామితో అందరూ ఏకీభవించారు.

కాని ఒకరు ప్రేమించిన అమ్మాయి కొరకు మరొకరు ప్రేమించకూడదని, ఆ అమ్మాయిని సిస్టర్‌లా చూడాలని ఒట్టుపెట్టుకున్నారు.

"తానూ ఒక అమ్మాయిని ప్రేమించబోతున్నాను" అన్న భావన ప్రతి ఒక్కరిలోనూ ఆనందాన్ని, భయాన్ని రేకెత్తించింది.

"తాను ప్రేమించే అమ్మాయి ఎలా వుంటుందో?"

"ఆ అమ్మాయికి ఏ సినిమాలంటే ఇష్టమో!"

"ఆమెకి ఎటువంటి గిఫ్ట్స్ లివ్వాలి"

ఎవరికివారు ఈ తరహా ఆలోచనలలో మునిగిపోయి వున్నారేగానీ రఘు రాకని గుర్తించలేదు.

"ఏమిటి అంతా మౌనవ్రతం పాటిస్తున్నారా ఏమిటి" అంటూ అప్పటివరకు వారి మధ్య ఆవరించుకునున్న స్తబ్దతని భంగపర్చాడు రఘు. విషయం తెలియజేశారు.

"విష్ యు గుడ్ లక్'' గ్రీన్ సిగ్నల్ ఇచ్చాడు.

విజయవాడలోని లబ్బీపేటలోనున్న వేంకటేశ్వర స్వామికి కొబ్బరికాయలు కొట్టి తమ ప్రయత్నాలు నెరవేరాలని కోరుకున్నారు.

ఆ రాత్రి పూల మొక్కల మధ్య సర్వసభ్య సమావేశాన్ని ఏర్పాటు చేశారు. ఆ సమావేశంలో చర్చనీయాంశం _ ఏ ప్రాంతంలో రూముని వెదకాలి.

"కాలేజీకి ఎంత దగ్గరగా వుంటే అంత మంచిది. లేకుంటే నేను నడవలేను" ముందుగానే తెల్ల జండా ఎత్తేశాడు వెంకటపతి.

''కావాలంటే పది నిమిషాల ముందు బయలుదేరు. లేదా మేమంతా చందాలు వేసుకొని సైకిలు కొనిస్తాం. అంతేగాని అర్భకుడిలా బీద అరుపులు అరవబోకు'' కోపడ్డాడు లక్ష్మణ్.

''భోజనానికి రెండుపూటలా మెస్‌కి వెళ్ళాలి. అందువల్ల మెస్‌కి దగ్గరగా రూము తీసుకోవడం ఉత్తమం'' తన అభిప్రాయాన్ని తెలియజేశాడు స్వామి.

''నీ కెప్పుడూ తిండి రందే. నడవలేకపోతే రూములోనే వుండు. క్యారియర్ తెచ్చే ఏర్పాటు చూసాను'' అంటూ స్వామి అభిప్రాయాన్నికూడా ప్రకటనలతో వేశారు

"ఒరేయ్, మనం హాస్టల్ వదిలిపెట్టేది ఎందుకు? ప్రేమాయణం సాగించడానికి. అందుకని కాలేజీ గరల్స్ ఎక్కువమంది ఎక్కడుంటారో అక్కడే మనం రూము తీసుకుందాం. ఏమంటారు" అనడిగాడు సత్తిరాజు.

"ఇంకా ఏమనే దేముందిగురూ, నీమాటే ఫైనల్" అని లక్ష్మణ్ అంటే, "సత్తీ, అసలు నీ బుర్రలో ఏముందిరా" అంటూ టింగున తలమీద మొట్టికాయవేసి, "మామూలుగానే మ్రోగుతుందే, అయినా ఇంత పెద్దపెద్ద ఆలోచనలు ఆ చిన్నబుర్రలో ఎలా పుడతాయబ్బా" అన్నాడు వెంకటపతి.

"ఒరేయ్ వెంకటపతి! నీవు బొజ్జ పెంచావుగాని ఆ బుర్రలో గుజ్జుపెంచలేదురా. లేకుంటే తల చిల్లుపడేలా

మొట్టుకాయ వేస్తావట్రా!" బాధగా తల పట్టుకుని అన్నాడు.

"సారీ బ్రదర్" అన్నాడు వెంకటపతి.

మరుసటి రోజునుంచి రూముల కొరకు వేట ప్రారంభించారు. గదుల్లోకి గాలి రాకపోయినా పర్వాలేదు. వాటర్ లేకపోయినా ఇబ్బంది లేదు. కాని ఆ ప్రాంతంలో కాలేజీ గరల్స్ వుండాలి. అది ఎంత దగ్గరగావుంటే అంత ఎక్కువ అద్దె చెల్లించడానికి వారు సిద్ధమయ్యారు. చివరకు ఏలాగయితేనేం అతికష్టంమీద ఒక గోడౌను సంపాదించారు. ఆ గోడౌనుని వారు సెలక్టుచేసుకోవడానికిగల ఏకైక కారణం_ ఎదురింట్లో స్టెల్లా కాలేజీ విద్యార్థినులు అద్దెకున్నారు.

తాము ఏ వేషాలేసినా రెండు నెలలవరకు గది ఖాళీచేయమనరు అనే ఆశతో రెండు నెలల అద్దె అడ్వాన్సుగా చెల్లించారు.

సెకండు టరమ్ ప్రారంభమయింది.

తిరిగి హాస్టల్‌కి కొత్త కాంతి వచ్చింది.

రూములకు అడ్వాన్సు ఇచ్చి వచ్చారు. కాబట్టి పిలయినంత త్వరగా హాస్టల్‌నుంచి బయటపడాలి. అందుకుగాను నలుగురూ నాలుగు సిగరెట్ ప్యాకెట్లు తెచ్చుకున్నారు.

బ్రేక్‌ఫాస్టు పూర్తికాగానే లాన్‌లో కూర్చున్నారు. వార్డెను తన గది ముందున్న వరండాలోకి రావడం గమనించి సిగరెట్స్ వెలిగించారు.

వెంటనే ఫాదర్ తన గదిలోకి వెళ్ళిపోవడం గమనించి ఒరేయ్ అరకాల్ చూశాడు, మరో నిమిషాలలో పిలుపొస్తోంది. అయిదు నిమిషాలలో మనం తట్టా బుట్టాసర్దెయ్య వచ్చు" సంతోషంగా అన్నాడు సత్తిరాజు.

అతడాశించినట్లే అటెండరు వచ్చాడు. 'ఫాదర్ మిమ్మల్ని రమ్మంటున్నారు' అని చెప్పాడు.

'చూశావా మన ప్లాన్ సక్సెస్' అన్నట్టుగా వారి వైపు చూసి నవ్వాడు సత్తిరాజు.

అంతా వార్డెను గదిలోకి వెళ్ళారు.

"కూర్చోండి" అంటూ ఎదురుగా వున్న కుర్చీలు చూపించారు.

"మీరు చెప్పబోయేది మాకు తెలుసులే" అనుకుంటూ కూర్చున్నారు.

"మీరు నాలుగు రోజుల క్రితమే హాస్టల్‌కి వచ్చినట్లు తెలిసింది. చదువుపట్ల మీకున్న శ్రద్ధకు నా అభివందనలు. అందుకే మీరంటే నాకు ప్రత్యేకమైన 'అభిమానం' అంటూ డ్రాయరు సొరుగులోనించి ఒక స్వీట్సు ప్యాకెట్ బయటకు తీసి, "ఒక హాస్టలర్ నా కోసం ఇంటి దగ్గర్నుంచి ప్రత్యేకంగా తెచ్చి ఇచ్చాడు. కాని నాకు షుగర్ కంప్లెయింట్ వుంది. అలాగని కానుకని తిరస్కరించి అతన్ని చిన్నబుచ్చడం ఇష్టంలేక తీసుకున్నాను. మీరు నలుగురూ తీసికోండి ఎప్పుడయినా నలుగురూ కలిసివుంటేనే అన్ని విధాలా మంచిది. హాస్టలు విడిచి వెళ్ళినా మీరు నలుగురూ కలిసుండాలనే నేను కోరుకుంటున్నాను" అన్నాడు.

"థాంక్యూ ఫాదర్" అంటూ స్వీట్సు ప్యాకెటు తీసికొని గదికి బయలుదేరారు.

గదికి చేరుతూనే. ఛ ఛ ప్లానంతా తలక్రిందులయింది. హాస్టల్ విడిచి బయటకు పొమ్మంటాడనుకుంటే ఈ స్వీట్సు చేతిలో పెట్టాడు. ఎవడికి కావాలి ?" అంటూ ప్యాకెట్టుని గది మూలకి విసిరాడు.

తిరిగి మొదటి కొచ్చారు.

హాస్టల్ నుంచి బయటపడటమెలా? అన్నది దుర్భేద్యమయిన సమస్యగా నిలిచింది వారి ముందు.

"ఒరేయ్ ఒక పని చేద్దాం. మనంనలుగురం కలి సుందటయే కదూ ఆయనకి కావలసింది. ఇప్పుడు మనలోని ఒకడికి హాస్టల్ భోజనం పడలేదు. అందువల్ల బయటకు వెళ్ళిపోతున్నాడు, వాడికోసం మిగతా ముగ్గురూ వెళ్ళిపోతున్నారు. ఏమంటారు ?"

"అమ్మ వెధవా, నీ బుర్రలో కూడా గుజ్జుందిరా" అంటూ స్వామిని ప్రశంసించాడు లక్ష్మణ్.

ముద్దకుడుంలా వాళ్ళ మాటల్ని వింటున్న వెంకటపతి, "అయితే ఆ పేషెంట్ ఎవరో చెప్పండి. త్వరగా నాటకం ప్రారంబిద్దాం" అన్నాడు.

"బుజ్జిబాబూ, ఆ వేషం నీవు వేస్తేనే నాటకం రక్తి కట్టదు" అన్నాడు సత్తిరాజు.

"ఛ, దున్నపోతులాగా వున్నాడు. వాడికి తిండి సయించడం లేదంటే ఎవరన్నా నమ్ముతారా ?" అడిగాడు లక్ష్మణ్ !

"అక్కడే పొరపాటు పడుతున్నావు. రెండురోజుల వరకు తిండి తినడు. దానితో ముఖం పీక్కుపోయి పేథటిక్ లుక్ వస్తుంది"

"అయ్యో రెండు రోజులే ! నాకు ప్రేమ వద్దు, పెళ్ళి వద్దుగాని నేనిక్కడే వుండిపోతాను" అని మంచం మీద బోర్లాపడ్డాడు. హఠాత్తుగా అంత భారంమీదపడేసరికి మంచం "కయ్" మంటూ రోధించింది. కాని దాని బాధని గుర్తించే స్థితిలో లేరు ఏ ఒక్కరూ !

"ఒరేయ్ వెంకటపతి! ఆ పాత్రని నీవు పోషిస్తేనే నాటకానికి జీవం వస్తుంది. గడ్డం పట్టుకుంటాను. కాదంటే కాళ్లు పట్టుకుంటాను" ప్రాధేయపడ్డాడు సత్తిరాజు.

ఆ విషయం మొదట ప్రపోజ్ చేసింది తానే అన్న విషయం గుర్తుకొచ్చి, సత్తిరాజు అభ్యర్ధనని మన్నించి

నట్టుగా పోజు పెడుతూ 'సరే' అన్నాడు.

రెండురోజులు భోజనం మానాడు, అసలే తిండి పోతయిన వెంకటపతి రెండురోజులు భోజనం మానడంతో తోటకూర కాడలా నీరసంగా తయారయ్యాడు.

"పేథటుక్ లుక్ రాలేదు" అంటూ తలంతా చెరిపి, జుట్టువి ముఖం మీదకు దువ్వారు. పైపెచ్చు ముఖానికి నూనె పులిమారు. నిక్కరుతో షర్టు లేకుండా పడుకోబెట్టారు.

"హమ్మయ్య! ఇప్పుడుగాని కోరుకున్న పోజు రాలేదు వెధవతో" అనుకొని వార్డెను దగ్గరకు పరుగెత్తాడు సత్తిరాజు.

రెండు రోజుల నుంచి తిన్నది తిన్నట్టే వెళ్లిపోతుందని, నీరసంగా పడున్నాడని తెలుసుకొన్న వార్డెను హుటా హుటేన పరుగెత్తుకొచ్చాడు.

పులిలా తిరిగే వెంకటపతి అలా మంచానికి అంటుకొని పడి వుండటంతో ఆయన హృదయం ద్రవించింది.

"ఈ విషయం ఇప్పటివరకు నాకెందుకు చెప్పలేదు" అని,

"డాక్టరు బరాల్‌కి ఫోను చేస్తాను. వెంటనే అమెరికన్ హాస్పిటల్‌కి తీసుకెళ్ళండి" అన్నాడు.

నలుగురి గుండెల్లో ఒకేసారి పిడుగు పడింది.

"ఎక్స్యూజుమి ఫాదర్... మా అంకుల్ డాక్టరు. ఆయన దగ్గరకు తీసికెళ్తాము. మెడిసెన్స్ ఖర్చువుండదు."

"మీ యిష్టం. ముందు అర్జంటుగా డాక్టరు దగ్గరకు తీసికెళ్ళండి"

"అలాగే ఫాదర్" అంటూ పరుగెత్తాడు స్వామి.

మెల్లగా వెంకటపతిని లేవదీసి షర్టు తొడిగారు. చెరొక రెక్కపట్టుకొని లేవదీసి, భుజాలమీద వేసుకొని క్రిందకు దారి తీసారు. యాక్షనులో రియాల్టి" చూపించా

లవి సతువ లేని వాడిలా వారిద్దరిమీదే భారమంతా వేశాడు. చిన్న సైజు ఏనుగులాంటి వెంకటపతి బరువంతా మీదపడే సరికి, "ఓరి వెధవా! ఇంత బరువున్నావా... రోజుకి ఎంత అన్నం లాగిస్తున్నావురా !" అనుకొన్నాడు.

ఎలాగయితేనేం బయటపడ్డారు.

రెండురోజుల్నించి తిండి కోసం అలమటిస్తున్న వెంకటపతి తిన్నగా హోటల్‌కు దారితీశాడు. పీకలవరకు మెక్కాగాని

"ఇప్పుడేం చేద్దాం" అనడగలేదు.

"ఏముంది, హాస్టల్‌కి మా ముగ్గుర్లో ఏ ఒక్కరు వెళ్ళినా 'వెంకటపతి'ని ఏ హాస్పటల్‌లో అడ్మిట్ చేసారని వెంటపడతాడు. అందువల్ల అయిదు రోజులు రఘు రూములో గడిపి హాస్టల్‌కి చేరుకుందాం. ఉప్పు, కారంలేని కూరలని తినాలని, రాత్రివేళ కేవలం చపాతీలే తీసు కోమని డాక్టరు చెప్పాడని చెప్పి అదెలాగూ హాస్టల్‌లో సాధ్యపడదు గనుక వెళ్ళిపోతున్నాం అని చెప్పి హాస్టల్ ఖాళీ చేద్దాం" అన్నాడు స్వామి.

అంతా "సరే" అంటే "సరే" అనుకున్నారు.

వాళ్ళ ప్లాను సక్సెసు అయింది.

* * *

తల చిక్కుదీసుకుంటూ వాకిట్లోకి వెళ్లిన సునీత, "ఏయ్ సుహాసినీ" అని గావుకేక పెట్టడంతో, బోటనీ రికార్డువర్కు పూర్తిచేస్తున్న సుహాసిని "నీకే మొచ్చిందే" అంటూ చేతిలోని పెన్సిల్‌ని ప్రక్కన పెట్టి అయిష్టంగానే లేచి వచ్చింది.

"అదిగో అటుచూడు" అంటూ ఎదురుగా వున్న గోడౌను వైపు చూపించింది" నల్లగా పొట్టిగా లావుగా బెంజిలారీ టైరులా వున్నాడు. ఎవడేవాడు?" అనడిగింది.

"నేరేడుగాయలా నల్లగా నిగనిగ లాడుతున్న శరీరంతో, మెడమీదకు పడుతున్న జుట్టుతో సిలిండరులా వున్నాడు గురుడు "అవి" ఏమేవ్, లక్ష్మిని ఏడిపిద్దామా?'' అడిగింది.

"ఎలాగే''

"వెయిట్ అండ్ సీ" అని, లోపలికి రెండంగలు వేసి, "లక్ష్మి, లక్ష్మి" కేక వేసింది.

వంటపని చేసున్న లక్ష్మి, "ఏమిటే, ఏమిటా గావు కేకలు" వంట ఇంట్లోనుంచి అడిగింది.

"మీ బావ వచ్చాడే!"

"మా బావా" అంటూ బయటకు వచ్చిన లక్ష్మి ''ఎక్కడే" అనడిగింది.

"అదిగో అటు చూడు" అని వెంకటపతిని చూపించింది సునీత.

''ఛీ! వాడెవడో 'జూ' లోనుంచి తప్పిచుకొచ్చిన చింపాంజీలా వున్నాడు. ఆ 'ముద్దకుడుం' గాడ్ని పట్టుకొని మాబావ అనటానికి నీకు నోరెలా వచ్చిందే" అంటూ తిరిగి వంట ఇంట్లోకి దారితీసింది.

సరిగ్గా అదే సమయంలో తలెత్తిన వెంకటపతి ఎదురింటి గుమ్మం వద్ద ఇద్దరమ్మాయిలు నిల్చొని తనవైపే చూస్తూ నవ్వుతూ మాట్లాడు కోవటం గమనించాడు.

గుండె జల్లుమంది. మరుక్షణంలో ఆనందం ఉప్పెనలా పెల్లుబికింది. సంతోషంలో కంఠం మూగపోయింది. చేష్టలుడిగి ప్రతిమలా నిల్చుండిపోయాడు.

"ఏమిటే "ముద్దకుడుం" అలా దిష్టిబొమ్మలా నిల్చునుండిపోయాడు. ఖర్మకాలి నిన్ను చూపుల్తోనే ప్రేమించడం లేదుగదా !" అన్నది సునీత.

"ఏయ్ ! ఏమిటే ఆ మాటలు ? నన్ను అటపట్టించ

డానికి ఆ మన్మథుడే దొరికాడా ? పద లోపలికి..." అంటూ లోపలికి తీసికెళ్ళింది. వారు వెళ్ళిన అయిదు నిమిషా లకు గాని వెంకటపతి తేరుకోలేదు. తేరుకొన్న వెంటనే చెంగు చెంగున గంతులు వేస్తూ లోపలికి పరుగెత్తాడు.

షేవ్ చేసుకొంటున్న సత్తిరాజు 'గత గత' శబ్దం విని తలెత్తి చూశాడు. లోపలి కొచ్చింది కోడెదూడకాదని, వెంకటపతి అని తెలుసుకొని, "ఏమిటి విశేషం ! మంచి హుషారుగా వున్నావు" అద్దంలో ప్రతిబింబం చూసు కుంటూ అడిగాడు.

"ఎదురింటి అమ్మాయిలు నన్ను చూసి నవ్వారు"

ఉలిక్కిపడి చూశాడు సత్తిరాజు.

కోపగించుకున్న రేజర్ అందుకు గుర్తుగా చిన్న గాటు పెట్టింది. పుస్తకాలు సర్దుతున్న లక్ష్మణ్, స్వామి ఆ మాట వింటూనే చేతిలోని పుస్తకాల్ని అక్కడే పడేసి, "ఎలా వున్నారురా" అంటూ ఆదుర్దాగా వచ్చారు.

వారంతా తన నలా అడగడంతో ఏనుగెక్కినంతగా సంబరపడిపోయాడు.

"అమ్మాయి చాల బాగుందిరా. రెండు చిటిచిట్టికళ్ళు నుదుట బొట్టు..."

"కళ్ళకు కాటుక. తలమీద జుట్టు, రెండు చేతులు ఆ చేతులకి గాజులు" వెంకటపతి ఏవో చెప్తాడని అనగా ఎదురు చూసిన వాడల్లా రెండు కళ్ళున్నాయ్యని. అంటూ మొదలు పెట్టడంతో కోపంతో వ్యంగ్యంగా అన్నాడు సత్తి రాజు.

కాని ఆ విషయం గ్రహించిన వెంకటపతి, "భలే చెప్పావురా! నీవుచూశావా!" అని అమాయకంగా అడిగాడు.

"అవును చూశాను" అని "నోర్ముయ్యరా" అన్నాడు.

తెల్లమొహంవేశాడు వెంకటపతి.

"అమ్మాయి అన్న తర్వాత సర్వసాధారణంగా జడ వేసుకుంటుంది; బొట్టు, కాటుక పూలు పెట్టుకుంటుంది. అందువల్ల అమ్మాయి అంటే సన్నగా వుంటుందా, లావుగా నీలాగా వుంటుందా ? నవ్వితే బుగలపై సొట్టలు పడతాయా మొహం ఎలా వుంటుంది, జడ పొడవా పొట్టా— ఇత్యాది విషయాలు చెప్పాలి"

"ఆఁ సీ. నేను సరిగా చూడలేదు."

"అసలు చూడవలసిందవే"

"మరయితే సత్తిరాజు అమ్మాయిలు అబ్బాయిలలో ఏం చూస్తారు" అడిగాడు లక్ష్మణ్.

"ఎందుకురా"

"ముందు జాగ్రత్త పడదామని !"

"నా ఉద్దేశం ప్రకారం అమ్మాయిలు అబ్బాయిలలా తొందరపడరు. వాళ్ళు చాలా విషయాలు చూస్తారు. వాటిలో మొదటిది— అందగాడా కాదా అని రెండవది — డబ్బు మూడవది — కులం అని ఈ మూడూ వాళ్ళకి అనుకూలంగా వుంటే ప్రేమించేస్తారు, ఆనక ప్రేమకు పరాకాష్ట పెళ్ళి అంటారు. లేదా ఇంతే సంగతులు, చిత్తగించవలెను"

అనాలోచితంగా అద్దంలో తన ముఖం చూసుకున్నాడు లక్ష్మణ్.

"వెంకటపతి' కన్నా వెయ్యిరెట్లు అందంగా వున్నాను. వారి ప్రక్కన నిల్చుంటే నేనెంత అందగాడో అమ్మాయిలకు తెలుస్తుంది. వెంకటపతినిచూసి నవ్వినఅమ్మాయిలు నన్ను చూసి నవ్వరా ?' అనుకున్నాడు లక్ష్మణ్.

'కాని వెంకటపతి మాత్రం, "సత్తిగాడిఅంత థీరిటికల్ నాలెడ్జి. రఘుకి ప్రాక్టికల్ నాలెడ్జి వుంది. ఈ విషయంలో వాడి సలహా తీసికోవడం ఉత్తమం" అనుకున్నాడు. అనుకోవడమేకాదు, ఆరోజు సాయంత్రమే

రఘుని ఇంటి దగ్గర కలిసి అదే విషయం అడిగాడు.

నవ్వి, "వెంకటపతి, ప్రేమ అనేది హృదయంలో పుష్పంలా వికసించాలి. ఈ భావం ఎప్పుడు ఎవరిలో ఎందుకు తలెత్తుతుందో చెప్పలేం. కాని ఒకటి మాత్రం చెప్పగలను. పురుషుడు తాటాకుమంట అయితే, స్త్రీ చింత నిప్పు లాంటిది. ఆమె హృదయాన్ని ఇచ్చేముందు జీవితాన్ని ప్రతి కోణంనుంచి ఆలోచిస్తుంది. ఆమె ప్రేమను సంపాదించుకున్నాడా, వాడికోసం ఆమె ప్రాణాలనయినా ఇస్తుంది" అన్నాడు.

"ఏడ్చినట్లుంది. నీవేదో ఒక ఎఫైర్ నడిపావు గనక నాకేమైనా సలహాలిస్తావేమోనని ఎంతో ఆశగా వాళ్ళందరికీ మస్కాకొట్టి వస్తే ఈ సొదంతా చెప్తావేమిటి"

"నిజమే నీవన్నట్లు జీవితమంతా గుర్తుంచుకోదగిన మధురాతి మధురమయిన జీవితాన్ని ఆమె సాంగత్యంలో అనుభవించాను. కాని ఆమె నాలో ఏంచూసిందో నాకు తెలియదు. అయినా చెప్తాను విను-సాఫ్ట్ నేచర్, బుద్ధిమంతుడు అని పదిమందిచేత అనిపించుకోవడం, వ్యక్తిగతంగా ప్రతిభా సంపన్నుడుకావడం ఇత్యాది లక్షణాలున్న వ్యక్తిని ఒక స్త్రీ ఎంతగా ఇష్టపడుతుందో అల్లరి చిల్లరి పనులు చేస్తూ కొంచెం గడుగ్గాయి అనిపించుకోవడం. జీవితంలో రిస్కు తీసుకోవడం ఇత్యాది లక్షణాలున్న వ్యక్తినికూడా ఆమె ఇష్టపడుతుంది. అంటే ఏ అమ్మాయినయితే నీవు నిత్యం అల్లరి పెడుతున్నావో ఆ అమ్మాయి నీపై చిర్రుబుర్రులాడినా నీవంటే ప్రేమలేదు అనుకోకూడదు. కాని-ఈ పూట తన వెంటపడి, మరోపూట మరో అమ్మాయి వెంటపడే వ్యక్తిని మాత్రం ఆమె సహించదు.

"వెంట పడటానికి ఆమె మా ఇంటి ముందేగా వుండేది."

"ఆ అమ్మాయితో నీకు ఏమాత్రం పరిచయం వుందని ప్రేమించడం ప్రారంభిస్తున్నావు" – రఘు ప్రశ్న.

ఆ ప్రశ్నకు వెంకటపతికి కోపమొచ్చింది. "అసలు నీ ఉద్దేశ్యం ఏమిటి? ప్రేమించడమే తప్పా? అలాగయితే నీవెందుకు ప్రేమించావు?" అన్నాడు.

"చింతకాయను చూడగానే నోరూరడం ఎంత సహజమో, ఒక కుర్రవాడు మరో కుర్రదాన్ని ప్రేమించడం కూడా సహజమే; తప్పనను. కాని కాలక్షేపానికి ప్రేమ అంటూ వెంటపడుతున్నావా లేక ఆమెతో జీవితాన్ని పంచుకుందామనా? అన్నది నాకు అర్ధంకాలేదు."

"నీలా పిరికివాడ్నయి పారిపోయి మాత్రం రాను. ఆమె కూడా నన్ను ప్రేమిస్తే తప్పకుండా పెళ్ళి చేసుకుంటాను" అని సమాధానం కొరకయినా ఎదురు చూడకుండా చరచరా బయటకు నడిచాడు.

గుండెలలో బాకు దిగబడినట్లుగా విలవిలలాడాడు రఘు.

"కుసుమా! నేనెందుకు పిరికివాడ్నయి పారిపోయి వచ్చానో కనీసం నీవైనా నన్ను అర్ధం చేసుకుంటావా" అంటూ బాధగా కళ్ళు మూసుకున్నాడు.

రఘు దగ్గర్నుంచి తిన్నగా గదికి వెళ్ళాడు వెంకటపతి. సత్తిరాజు పుస్తకం బిగ్గరగా చదువుతుంటే లక్ష్మణ్, స్వామి శ్రద్ధగా వింటున్నారు.

వెంకటపతిని చూస్తూనే, "ఎక్కడికెళ్ళావ్? త్వరగా రా ఇప్పటికే రెండు చాప్టర్లు మిస్సయ్యావు" అన్నాడు లక్ష్మణ్.

"ఏమిటది?"

"ప్రేమించటమెలా? వలవేసి గెలుపొందడమెలా? అని ఒక మంచి బుక్ వచ్చింది. దాన్ని తిరగేస్తున్నాం".

"అనవపరంగా మిస్సయ్యానే" అంటూ ఉత్సాహాన్ని పుంజుకొని కూర్చుంటే "ఇప్పటివరకు చదివిందంతా బ్రీఫ్‌గా చెప్పండి. లేకుంటే ఫాలో కాలేను" అన్నాడు.

"ఏం లేదురా, ఒక అమ్మాయిని ప్రేమించాలంటే ఫస్ట్ క్వాలిఫికేషన్_నీవు ఎప్పుడూ ట్రిమ్‌గా తయారయి ఆమెకు కనిపిస్తూ వుండాలి. అందంగా ఎప్పుడయితే కని పించావో అప్పుడే ఆమె ఒకటికి రెండుసార్లు నీ వంక చూస్తుంది. తర్వాత ఆమెకు ఏమేమంటే ఇష్టమో తెలుసు కోవాలి. ఉదాహరణకు ఆమె రోజూ గులాబీలు పెట్టుకుం దనుకో, నీవు తెల్ల డ్రస్ ఎక్కువగా ధరించాలి. అలాగే ఆమె నవలలు, వీక్లీలు ఎక్కువగా చదువుతుందనుకో నీకు ఇంట్రస్టు లేకపోయినా ఆమెకోసం మార్కెట్‌లోకి మ్యాగ జైను వచ్చీరాగానే కొనుక్కురా. నీకు నవలలంటేను, మ్యాగజైన్లంటేను పిచ్చి అన్న అభిప్రాయం, ఏ మ్యాగ జైను కావాలన్నా నీ దగ్గర దొరుకుతుంది అనే ఇంప్రషను ఆమెకు కలగాలి. దానితో ఆమె మ్యాగజైన్లకోసం తమ్ముడ్నో, పనిమనిషినో పంపుతుంది. మ్యాగజైన్లు ఇచ్చి పుచ్చుకోవడం జోరు పెరిగాక తమ్ముడో, పనిమనిషో దొర కకపోతే ఆమే రావచ్చు. అప్పుడు నీవు 'అరె ఆఫ్టరాల్ వీటికోసం మీరొచ్చారా' అంటూ హడావిడిచేసి అవిడకి మర్యాదలు భారీ ఎత్తున చెయి. మొహమాట పడుతుంది. కాఫీకి నిన్ను వాళ్ళింటికి పిలుస్తుంది. లేదా నవలలు ఇచ్చే వంకతో నీవే వాళ్ళింటికి వెళ్ళు. ఆ సీరియల్‌లో ఆ రచ యిత్రి బ్రహ్మాండమయిన ట్విస్టు ఇచ్చింది, ఈ రచయిత్రి బ్యూటిఫుల్ నెరేషన్ ఇచ్చింది అంటూ సీరియల్ ముమ్ముందు ఏం కాబోతుంది అన్న విషయమై తరచుగా ఆమెతో పందెం కాయి. పందెమంటే ఓడిపోయినవారు గెలిచినవార్ని సినిమాకి తీసికెళ్ళడం అన్నమాట। జాగ్రత్త

ఆమె ఒక పందెం ఓడిపోతే నీవు రెండు పందాలు ఓడిపోవాలి."

"ఆ అమ్మాయి చేతిలో మనం ఎక్కువ పందాలు ఓడిపోతే మనల్ని దద్దమ్మలను కుంటుందేమో!" లక్ష్మణ్ కి ధర్మ సందేహం వచ్చింది.

"అదీ పాయింటే" అని, అయితే ఫిఫ్టీఫిఫ్టీ" అన్నాడు.

"నవల లివ్వడం. కాఫీలు త్రాగడమేనా? మరి "లవ్" విషయం చెప్పేదెప్పుడు "అనడుగుతున్న వాడ్ని," "త్వరపడకురా వెంకటపతి! ప్రతిదానికీ తొందరేనా?" అని వారించి, "నవలలు నీ సొంతమేగా! అవి చదివేటప్పుడు లవ్ డయిలాగ్స్ వచ్చినప్పుడల్లా పెన్ తో మార్కు చేయి. ఆ తర్వాత ఆ నవల ఆమె కిస్తావుగదా, అది చదివిన ఆమె ఎప్పుడో ఒకప్పుడు ఎందుకలా నోట్ చేశారనో మరొకటో. తప్పక అడుగుతుంది. ఇహ ప్రేమ పర్వం ప్రారంభించగానే బండిని ముందుకు నడపడం నీవంతు" అన్నాడు.

అస్త్ర విసర్జన చేసిన అర్జునుడు శ్రీకృష్ణుని గీత బోధనతో తిరిగి ధనుర్బాణాలను చేతబూనినట్లు రఘు మాటలతో మతిపోయిన వాడిలా గది చేరుకొన్న వెంకటపతి సత్తిరాజు మాటలతో నూతనోత్సాహాన్ని పుంజుకున్నాడు.

ఈల వేసుకొంటూ బయటకు నడిచినవాడల్లా, గేటు దగ్గర మెట్లమీద సీతాకోక చిలుకల్లా కూర్చునున్న ముగుర్ని చూడగానే అప్రయత్నంగా ఆగిపోయాడు. వెంటనే తనకు తాను ధైర్యం చెప్పుకొని స్మయిల్ ఒకటి విసిరేశాడు. అదిరిపడి చూసింది సునీత.

"ఏమేవ్, ఏమిటి మీ బావ నిన్ను పలుకరిస్తున్నట్లున్నాడే" లక్ష్మివైపు చూస్తూ అన్నది సునీత.

"ఛీ, ఆ ముద్దకుడుంగాడు మా బావ ఎమిటి? లొట

లొటా పంట్లాం, ఆ జుట్టు. ఆ బొజ్జ చూస్తుంటే మా మిరప తోట్లోని దిష్టిబొమ్మ గుర్తుకొస్తోంది" అన్నది లక్ష్మి.

"ఏయ్, ఏయ్...ఆ నల్ల కుక్కపిల్లని చూడండే" అని సుహాసిని అనగానే లక్ష్మి, సునీత తటాలున దృష్టి మరల్చారు.

"పొట్టిగా, పీలగా, నల్లగా, ముఖంమీదకు దువ్విన జుట్టువాడు...వాడ్ని చూస్తే నాకు మా 'టామీ' గుర్తు కొస్తుందే" తిరిగి అన్నది సుహాసిని.

"అయితే ఇంకేం, పెంచుకో" — లక్ష్మి.

"అలాగే. ముందు నీవొక గొలుసు కొనిపెట్టు" అని అంటున్నదల్లా సునీత తొడమీద గిచ్చడంతో "అబ్బ ఉండవే" అంటూ ఎదురింటివైపు దృష్టిని మరల్చింది.

వెంకటపతి ప్రక్కనున్న లక్ష్మణ్‌ని చూసి "మొద్దబ్బాయి ప్రక్కన మరో బుల్లబ్బాయి చేరాడే? అంది.

"అదేమిటే, బుల్లబ్బాయి ఒకపక్క మనకి పోజు కొడుతూనే రెండవ పక్క నోట్లో వేలేసుకున్నాడు" అన్న లక్ష్మి మాటలకు మిగతా ఇద్దరూ నవ్వారు. తమవైపే చూసి నవ్వుతున్నారనుకొని తాముకూడా నవ్వకపోతే బాగుండదని స్నేహితులు ముగ్గురూ నవ్వారు.

"ఎందుకే య్యాబాసి మొహాలు మూడు నవ్వుతున్నాయి" దీర్ఘం తీస్తూ అన్న లక్ష్మి మాటలకు సునీత సుహాసిని నవ్వకుండా వుండలేకపోయారు. దానితో ఎదురింటి గేటుదగ్గర మరోమారు నవ్వుల జల్లు కురిసింది.

తామేదో వాళ్ళని జోక్‌చేసి నవ్వుతుంటే, తమ నవ్వుకి రెస్పాన్సుగా వాళ్ళెందుకు నవ్వుతున్నారో స్నేహితు రాంద్రు ముగురికీ అర్థంకాలేదు.

అప్పటివరకు గేటు దగ్గర నిల్చున్న ముగురు మిత్రుల్ని, ఎదురింటి మెట్లమీద కూర్చున్న ముగ్గురు

స్నేహితురాంద్రని చూస్తూనేవున్న స్వామి, తెలుగుసినిమా హీరో తొలిసారిగా తెరపై కనిపించినట్టు కనిపించాలని తలకు టోపీ. కళ్ళకు జోడు పెట్టుకొని మరీ రంగంలోకి ప్రవేశించాడు.

"వీడెవడో హెచ్. ఎమ్. టి. గాడు, పోజొకటి నరుకుతూ వస్తున్నాడు" – లక్ష్మి.

"హెచ్. ఎమ్. టి. ఏమిటీ, కొత్తపేరు పెట్టావ్?" అడిగింది సునీత.

"అదేనే హెల్మెట్ , టోపీ పెట్టుకున్నాడుగా ?"

"మొత్తానికి మంచం కోళ్ళలా నలుగురు తయారయ్యారు" అంతలో పాలవాడు రావడంతో లేచి లోపలికి నడిచారు.

ఆ ముగ్గురూ లోపలికి వెళ్ళడంతో మంచంకోళ్ళు నాలుగూ లోపలికి వెళ్ళాయి.

* * *

మంచంకోళ్ళు అని ముద్దుగా అమ్మాయిలచేత పిలపబడే వెంకటపతి, లక్ష్మణ్, సత్తిరాజు, స్వామి గదిగా మార్చిన గొడౌను హోటలుకి కొంచెందూరం. ఉదయమే కాఫీకి వెళ్ళి రావడం, మళ్ళీ మధ్యాహ్నం భోజనానికి వెళ్ళిరావడం ఇబ్బంది అనుకొని ఉదయం నలుగురులో ఒక్కడే కాఫీకి వెళ్ళతాడు. వస్తూ వస్తూ మిగతా ముగ్గురికి పట్టుకొస్తాడు. ఇది వాళ్ళు చేసుకొన్న ఏర్పాటు.

టైపు ఇన్‌స్టిట్యూట్‌నుంచి వస్తున్న సునీత, సుహాసిని. లక్ష్మి తమముందు ఒక చిన్నసైజు గున్న శరీరం నత్త నడకతో నడవడం గమనించారు. ఆ శరీరం మొద్దబ్బాయిదనికూడా గుర్తించారు. ఒకరిపైపుమరొకరు చూసుకొని 'సై' అంటే "సై" అనుకొన్నారు.

"ఏమే సుహాసిని! హోటల్ వాళ్ళు పార్శిలు సర్వీసుకూడా పెట్టారా ?" అన్నమాటలు వినిపించడంతో ముందు నడుస్తున్న వెంకటపతి వెనుదిరిగి చూశాడు.

అప్సరసలు ముగ్గురూ కనిపించారు. తన రొట్టెవిరిగి నేతిలో పడిందనుకొన్నాడు.

"లేదే. ఎదురింటి గోడౌనులో వుంటున్నాడు ఈ మొద్దబ్బాయి" సునీత ప్రశ్నకి సమాధానం ఇచ్చింది సుహాసిని.

"మొద్దబ్బాయి" అన్నపేరు వినగానే వెంకటపతి గుండెలు దడ దడ లాడాయి.

"స్టూడెంటా ?" లక్ష్మి ప్రశ్న.

"స్టూడెంట్సు అయితే బెల్ బాటమ్స్ ఫాంటు వేసుకొని, టక్ చేసుకొని ట్రిముగా తయారయి వుంటారుగాని ఇలా లొటలొట ఫాంటు వేసుకొని గూడెంలో తయారుచేసిన చెప్పులతో ప్రత్యక్షమవుతాడా ? కాఫీ టిఫనులు తెప్పించుకోవడానికి ఆ ముగ్గురు స్టూడెంట్సు పనికి ఇతన్ని కుదుర్చుకొని వుంటారు"

"అయితే రోజూ మనకి కూడా కూరగాయలు తెస్తాడేమోనే!"

బేజారెత్తి పోయాడు వెంకటపతి. పనివాడనుకొని తనకి వీళ్ళు పనిపాటలుఅప్పగించరుకదా! అనుకొన్నాడు. నడక వేగం హెచ్చించాడు.

పరుగులాంటి నడకతో గదికివచ్చి పడ్డాడు. అప్పటికి స్నేహితులు ముగ్గురూ మేల్కొనే వున్నారుకాని లేవలేదు.

"ఒరేయ్ సత్తి! బెల్ బాటమ్ అంటే ఏమిట్రా ?" అనడిగాడు.

"నీ పంట్లాం వుందిగదా! అదిపైన ఎంత వదులుగా వుంటుందో క్రిందా అంత వదులుగా వుంటుంది. అలా

కాకుండా పైన కొంచెం లైటుగా వుండి వుంటే అది బెల్ బాటమ్ అయ్యేది. పైపెచ్చు నీవు క్రింద మడత పెడతావు. బెల్ బాటమ్‌కి అలా వుండదు" అని, "ఎందుకలా ఉన్న ట్టుండి ఇవన్నీ అడుగుతున్నావ్" అడిగాడు.

"ఎదురింటి అమ్మాయిలలో సన్నగా. ఎర్రగా లేదు ఆ అమ్మాయి చెప్పింది మీరు బెల్ బాటమ్ వేసుకొని టక్ చేసుకొంటే బావుండును. ఈ పంట్లాం వేసుకోకండి అని"

పడుకున్న ముగ్గురూ ఆ మాటలు వింటూనే దడా లున లేచి కూర్చున్నారు.

'ఇంకా ఏమని చెప్పిందిరా'

'అంతలో ఆమె ఫ్రెండ్సు ఎవరో వచ్చారు. వెళ్ళి పోయింది.'

అంతే ! !

ఎవరికి వారు తమ డ్రెస్‌లన్నీ బయటకు తీశారు. వాటిలో బెల్స్‌గా మార్చదగినవి తీసుకొని టైలరింగుషాపు కెళ్ళారు. ఆ తర్వాత షూస్ కొన్నారు. ఎలాగయితేనేం ఆ రోజు సాయంత్రానికి నలుగురూ టక్ చేసుకొని స్టెల్లా కాలేజీ ముందున్న బడ్డీకొట్టు దగ్గర నిలబడగలిగారు.

కాలేజీ వదిలిపెట్టారు. సీతాకోక చిలుకల్లా అసంఖ్యా కంగా వస్తున్న అమ్మాయిల్ని చూడగానే రోమియోల హృదయాలు పరవశించాయి.

"కళ్ళముందు ఇంత అందమయిన ప్రపంచంవున్నా గుర్తించకుండా అనవసరంగా హాస్టల్ జైలులో కాలం వ్యర్థం చేశాం" అన్నాడు సత్తిరాజు.

టక్ చేసుకొని అటెన్షన్ పొజిషన్‌లో నిలబడిన ఆ నలుగుర్ని కబుర్లు చెప్పుకుంటూ వస్తున్న స్నేహితు రాండ్రలో ముందుగా చూసింది సునీత.

"లక్ష్మీ ! ఈవేళ పుస్తకాలు ఎక్కువగా వున్నాయి.

చేతులు నొప్పెడుతున్నాయి అన్నావుగా. నీ బాధ చూడలేక మీ బావ వచ్చాడే" అన్నది. సరిగ్గా అదే సమయంలో ఆ నలుగుర్ని చూసిన సుహాసిని "ఏమేవ్ ! ఎదురింటి బుల్లె బ్బాయిలు వచ్చారే" అన్నది.

"ఏమేవ్, మనం ఏదో వేళాకోళానికి అంటే వాడు నిజంగానే లొటలొటా పాంట్‌ని బెల్ చేయించి, టక్ చేసు కొని - అదీ నలుగురూ తయారయ్యారు'' - లక్ష్మి.

"ఒకడి ఆకారానికి మరొకడి ఆకారానికి పొంతన లేనివాళ్ళ కాంబినేషన్ చూస్తుంటే నవ్వొస్తుందే" తిరిగి అన్నది సునీత.

అలా వారు తమవైపే చూస్తూ నవ్వుతూ మాట్లాడు కోవడం గమనించిన రోమియోలు "గ్రీన్ సిగ్నల్ ఇచ్చా రురో" అంటూ అనుసరించసాగారు.

"బాగుంది ఈ బ్యాండుమేళం... రేపు ఎక్కడి కెళ్ళినా తయారవుతారు కాబోలు" అని ఈసడింపుగా అన్న లక్ష్మి నుద్దేశించి, "కోప్పడకే, ఆడపిల్ల ఒంటరిగా వీధిలోకి వెళ్ళే రోజులా ? కొంత అండగా వుంటారు. ఎప్పుడైనా సినిమా టిక్కెట్లు, పాలసీసాలు కావాలంటే తెచ్చిపెడతారు" అన్నది సుహాసిని. అస్పష్టంగా వినిపించిన ఆ మాటలు విని "మన గురించే ఏదో చెప్పుకుంటున్నారు'' అన్నాడు లక్ష్మణ్.

'మన డ్రెస్ బాగుందని అనుకుంటూ వుండుంటారు' వెంకటపతి ఉవాచ. తమ ఇంట్లోకి వెళ్తూ 'ఈ నలుగురూ వెనకే ఇంట్లోకి కూడా రావడంలేదుకదా !' అని వెనుదిరిగి చూసి, వారు తమ రూము ముందే ఆగిపోవడం గమనించి 'హమ్మయ్య' అని నిట్టూరుస్తూ ఇంట్లోకి నడిచారు.

"ఒరేయ్, ఇంట్లోకివెళ్తూ వెనుతిరిగి చూశారంటే లోపలికి రండి అని అర్థమే మోరా'' అన్నాడు స్వామి.

"అప్పుడే రమ్మనరురా. అధమం పదిరోజులయినా గడవాలి" సత్తిరాజు సమాధానం.

"మరయితే ఆ చూపుల భావమేమిటి ?"

'చూపులతోనే వీడ్కోలు చెప్పింది అంటూ ఈ రచయిత్రులు అప్పుడప్పుడూ వ్రాస్తుంటారే_అదే ఇది'

"హేపీ డే" అనుకొంటూ గదిలోకి నడిచారు.

అంతలో స్వామికి ఒక అనుమానం వచ్చింది, అమ్మాయిలు ముగ్గురు, అబ్బాయిలు నలుగురు. ముగ్గురమ్మాయిల్ని నలుగురబ్బాయిలు ప్రేమించాలా ? ఏమిటి అని. వెంటనే అదే ప్రశ్నను అడిగాడు.

"అది చాలా ముఖ్యమయిన విషయం రా. దానిని సాల్వ్ చేసుకోకపోతే చాలా సమస్యలొస్తాయి." అని ముగ్గురమ్మాయిలు వున్నారు. కాబట్టి ఈ రేస్‌లో ముగ్గురు అబ్బాయి లుండాలి. అంటే నాలుగవవాడు ఆ అమ్మాయిల్ని చెల్లెల్లా చూడాలి" అన్నాడు

"ఆ నాలుగవ వాడు ఎవరు ?

"లాటరీ వేస్తాం"

"ఒరేయ్, ఎర్రగా, సన్నగా వున్నదే ఆ అమ్మాయి అంటే నాకిష్టం. మాఇద్దర్నీ ఈ లాటరీ నుంచి మినహాయించండి" అడిగాడు వెంకటపతి.

"తప్పురా వెంకటపతి! నలుగురం కలిసివచ్చాం, నలుగురికీ ఒకేన్యాయం." అన్న సత్తిరాజు మాటల్ని మిగతా ఇద్దరూ బలపరచారు.

'ఒరేయ్ ఎర్రగా, సన్నగా వాలగరెబ్బలా వుండే ఆ అమ్మాయిఒకటి, చామనఛాయగా ఎత్తుగావుండే ఆఅమ్మాయి రెండు. కొంచెం నల్లగా లావుగావుండే ఆఅమ్మాయిమూడు' అంటూ చీట్లపై నంబర్లువేసి, 'ఇదిగో నాలుగవది సున్నా. ఈ నాలుగుచీట్లని మనం కళ్లుమూసుకొని తీసికుందాం.

ఎవరి అదృష్టం ఎలావుంటే అలాగే జరుగుతుంది. తనకు చీటీలో వచ్చినఅమ్మాయి మినహా మిగతా ఇద్దర్నీ సిస్టర్స్‌లా చూడాలి' అన్నాడు.

"ఓ కె." అంటే "ఓ.కె.' అనుకొని, నలుగురూ కళ్ళుమూసుకొని చీట్లు తీశారు.

"నాకు రెండు వచ్చింది" అరిచాడు లక్ష్మణ్.

"నాది మూడు"—స్వామి.

"నాది ఒకటి"—నవ్వుతూ చెప్పాడు సత్తిరాజు.

"నాకు సున్నావచ్చింది" జీరబోయింది వెంకటపతి కంఠం.

"అయితే వెంకటపతి మనకు బావ్మర్ది అనమాట" అనంటున్న లక్ష్మణ్‌ని "చంపేస్తాను వెధవా" అని బెదిరించాడు. తిరిగిఅన్నాడు" ఆసన్నటి అమ్మాయిని నేను ప్రేమించాను. ఇప్పుడు లాటరీ పేరుతో నన్ను నెట్టేశారు" అని.

"బాధపడకు పతీ; ఒప్పందం ఒప్పందమే కనుక నీవు మరో అమ్మాయిని ప్రేమించడం ప్రారంభించు"

"ఆ అమ్మాయిని ప్రేమించిన తర్వాత మరో అమ్మాయిని ఎలా ప్రేమించేది?"

''అలాంటి సెంటిమెంట్సు పెట్టుకోకు. రఘులా పిచ్చోడివయిపోతావు" అని "ఒకటి గుర్తుంచుకో- మగవాడి మనసు పుష్పక విమానంలాంటిది. ఎందరున్నా మరొకరికి చోటుంటుంది" అన్నాడు.

"అంతా మోసం" అంటూ దబదబా నేలను బాదుకుంటూ వెళ్ళిపోయాడు.

ఆ వెళ్ళడం వెళ్ళడం తిన్నగా రఘు ఇంటికి వెళ్ళాడు. పడక్కుర్చీలో పడుకొని భారంగా కళ్ళు మూసుకొని వున్నాడు రఘు. అతడి ఛాతిమీద ఆటోగ్రాఫ్ పుస్తకం తెరచి బోర్లా పెట్టివుంది.

"చదువుతూ, చదువుతూ అలాగే నిద్రపోయినట్టున్నాడు" అనుకొంటూ ఆటోగ్రాఫ్ పుస్తకం తీశాడు.

అప్రయత్నంగా తెరచివున్న పేజీమీదకు దృష్టి మళ్ళింది.

ప్రేమకు మరణంలేదు;
దానికి ఓటమిలేదు.
అది ఓడి గెలుచుకుంటుంది;
చావులేక బ్రతికి వుంటుంది.
లైఫ్ ఈజ్ ఎ ఛాలెంజ్ మీట్ ఇట్
ట్రాజెడీ ఫేస్ ఇట్
బ్యూటీ ప్రెయిజ్ ఇట్

—కుసుమ.

"ఈ కుసుమ ఎవరో హాయిగా తాను కాపురం చేసుకొంటూ వీడ్ని జ్ఞాపకాలతో చావగొడుతోంది" అనుకొంటూ ఆటోగ్రాఫ్ పుస్తకాన్ని ప్రక్కనేవున్న టేబుల్‌మీద విసిరి కొట్టాడు.

ఆ శబ్దానికి ఉలిక్కిపడి నిద్రలేచాడు.

"ఏమిటి ఎప్పుడూ ఈ కుసుమ గొడవేనా?" చొరవగా ప్రక్కనున్న స్టూలుమీద కూర్చుంటూ అడిగాడు.

"హృదయం ఒక ఆలయమయితే, అందులోవెలసిన దేవత కుసుమ..."అని ఇంకా ఏదో చెప్పబోయాడు. కాని ఎదురింటి గేటువద్ద ఒక విద్యుల్లత ప్రత్యక్షం కావడంతో "ఎవరామె" అని వెంకటపతి అడగడంతో, "శశికళ" అని సెకండు బి.కామ్ చదువుతోంది అని చెప్పక తప్పిందికాదు.

"థాంక్యూ" అంటూ వెక్కిబెట్టి విడిచినబాణంలా బయటకు దూసుకుపోయాడు. ఆమెను ఫాలోఅయ్యాడు.

*　　*　　*

తన సహజధోరణిలో మూడడుగులు ముందుకువేస్తే రెండడుగులు వెనుకకువేసుకొంటూ నడుస్తున్నాడు లక్ష్మణ్. ఫ్లాస్కు చంకకు తగిలించుకొని, టిఫిను పార్శెల్ను చేతిలో పట్టుకున్నాడు

సైన్సుఇన్స్టిట్యూట్ నుంచి తిరిగివస్తున్న సుహాసిని, సునీత, లక్ష్మి, లక్ష్మణ్ ని చూశారు.

"ఏమేవ్ ఏమిటి ఈవేళ మొద్దబ్బాయి డ్యూటీ బుల్లబ్బాయి పుచ్చుకున్నాడు" అన్నది సునీత.

"వైటుపాంటు, వైటుషర్టు చక్కగా టక్" చేసుకున్నాడే. ఒకపట్టుపడదామా ఈ పోజులరాయుడ్ని కూడా! సుహాసిని.

వాళ్ళ ముందు నత్తనడక నడుస్తూ పోజులు నరుకుతున్న లక్ష్మణ్ "ఏమే టి.పి. వెళుతున్నాడే" అన్న లక్ష్మి మాటలకు టి.పి. అన్నది తననేనా? లేక వేరొకర్నా? అని ముందు వెనకకు చూశాడు. ఆ వీధిలో తాను తప్ప మరో మగ పురుగు లేకపోవడం వాళ్ళు అంటున్నది తననే అని నిర్ధారించుకున్నాడు.

"టి.పి. కాదే ఆర్ పి." అన్నది సుహాసిని.

"అవునవును టినోపాల్ యొక్క సరికొత్తపేరు రాణీపాల్ ఉత్పత్తి అదే. పనితనం అదే. కాని పేరు మాత్రం కొత్తది"—సునీత.

"అదే రాణిపాల్" అని సునీత మాటలకు వంత పలికారు.

తాను వైట్ డ్రెసు వేసుకొన్నందున, అమ్మాయిలు ఆ విధంగా ఏడిపిస్తున్నారని గ్రహించాడు. మరో రెండు నిమిషాలు ఆలస్యం చేస్తే ఇంకేమంటారోనని పరుగుతీశాడు.

* * *

శశికళ వాళ్ళుంటున్న ఇల్లు కొంచెం దూరంగా వుందని సైకిల్ కొన్నాడు వెంకటపతి. ఉదయం వెళ్తాడు. ఆమె బయలుదేరే వరకు రఘు ఇంటిదగ్గర తచ్చాడుతూ వుంటాడు. ఆమె రిక్షాలో బయలుదేరగానే వెనకాలే బాడీ గార్డులా కాలేజీవరకూ వస్తాడు. తిరిగి ఇంటిదగ్గర దిగబెడతాడు దీనితో ఏదైనా ఒకరోజు వెంకటపతి అనివార్య కారణాల వల్ల రాలేకపోతే ఏదో పోగొట్టుకున్నదానిలా బాధపడేది. అలాగని అతడంటే ఆమెకు ప్రేమలేదు. "నల్లగా పోతులా వుంటాడు వాడితో ప్రేమేమిటి" అని ఈసడించుకొనేది. ఏమాటకామాటే చెప్పుకోవాలి. ఎన్నడూ వెంకటపతి పెదవి విప్పి ఒక మాటైనా మాట్లాడలేదు. కేవలం చూపుల ప్రేమికుడుగానే మిగిలపోయాడు.

కాని, సత్తిరాజు - లక్ష్మణ్ - స్వామిల ప్రేమలత మొగ్గలు తొడిగింది. ఉదయానేలేచి వారు ఎక్కడికి వెళు న్నారా అని డిటెక్టను మొదలుపెట్టిన సత్తిరాజువారు టైప్ ఇన్‌స్టిట్యూట్‌కి వెళుతున్నారని తెలుసుకున్నాడు. మరుసటి రోజునుంచి ఈ ముగ్గురూ టైపుఇన్‌స్టిట్యూట్‌లో చేరారు. క్రమక్రమంగా వీక్షలు ఇచ్చిపుచ్చుకోవడంతో ప్రారంభ మయి ఆ వీక్షలలో ప్రేమలేఖలకుకూడా వీరిస్నేహం స్థానాన్ని కల్పించింది. ఆ తర్వాత కలిసి సినిమాలకు వెళ్లే వరకు ఎదిగింది.

వీళ్ళ ప్రేమాయణంలో మరోమారు సెకండుటెరమ్ హాలీడేస్ పేరిట కర్టెనుపడింది. ఫస్టుటరమ్ హాలీడేస్‌కి ఇంటికి వెళ్లిన వెంకటపతి, 'బామ్మో! జుట్టు చికాకుపెడు తోందే. మొక్కుబడి ఇచ్చొద్దాం' అని గొడవపెట్టాడు. కాని సెకండుటెరమ్ హాలిడేస్‌లో 'మొక్కుబడి ఇచ్చొ ద్దాంరా' అని బామ్మ గొడవపెట్టినా 'ఇప్పుడొద్దు' అని దాటవేశాడు.

ఒక రోజున లొటలొటా పంట్లాంలో పల్లెటూరి నుంచి వెర్రివెంగలాయలా గూడెం చెప్పులు ధరించి కాలేజీకి వచ్చిన వెంకటపతి ఈ రోజున బెల్‌బాటమ్స్ రొమాంటిక్ హీరోలా మారాడు. మొక్కుబడికి పెంచిన జుత్తుని హిప్పీ జుత్తుగా మార్చాడు.

ధర్మ చెరమ్ ప్రారంభమయింది. సిటీబస్‌లను జాతీయం చేయాలని విద్యార్థులంతా సమ్మె చేశారు. ఎక్కడి బస్‌లను, రిక్షాలను అక్కడే ఆపివేశారు.

ఆ రోజున కాలేజీ లేదని తెలిసికొని. రెండు మైళ్ళు నడిచి ఇంటికి వెళ్ళడం ఎలా? అని దిగాలుపడిపోతూ అశోకవనంలో సీతలా నిల్చుంది శశికళ.

"ఒరేయ్ వెంకటపతీ! నీ హీరోయిన్ రిక్షాకోసం కాబోలు దిగాలుగా చూస్తుంది. ప్రక్కకు పిల్చుకురా ఎలాగోలా రిక్షా సంపాదిద్దాం" సలహా ఇచ్చాడు సత్తిరాజు.

అంతే హనుమంతుడిలా విజృంభించాడు వెంటపతి. "శశీ! నేను రిక్షా ఎక్కిస్తాను రా" అంటున్నవాడ్ని, 'నోట్లో నాలుక లేనివాడిలా నెలలతరబడి గుడ్డెదు చేలోపడినట్టు తన రిక్షా వెనకే వచ్చే వెంకటపతేనా తనని శశీ అని సంభోదించింది' అన్నట్టుగా చూసింది.

"ఆలస్యం చేయకు. త్వరగా నాతో రా" అంటూ చొరవగా చెయ్యిపట్టుకొని ఆ గుంపు నుంచి తీసుకెళుతుంటే అప్రయత్నంగా అడుగులేసింది.

'రిక్షా కదలడానికి వీల్లేదు' అని అభ్యంతరంచెప్పినా మంచంకోళ్ళు నాలుగూ కలిసి అతికష్టంమీద ఒక రిక్షాని ప్రక్కనున్నసందులోకి తీసికెళ్ళారు శశికళని ఎక్కించారు.

"వెంకట్ ! చెల్లాయిని జాగ్రత్తగా ఇంటిదగ్గర దిగబెట్టిరా" పెద్దరికాన్ని ప్రదర్శించాడు మొన్నటివరకు నోట్లో వ్రేలేసుకొని తిరిగి, విన్న "ప్రేమ" పేరుతో

సునీత కొంగుపట్టుకొని తిరుగుతున్న లక్ష్మణ్.

"అలాగే" అంటూ జ టా యు వు లా సైకిలుపై రిక్షాని ఫాలో అయ్యాడు.

చివరకు ఎలాగయితేనేం, అవాంతరాలను అధిగమించి గమ్యం చేరుకున్నారు. రిక్షాదిగి డబ్బులుఇచ్చే ఉద్దేశంతో పర్సు తెరిచింది. కాని ఆమెకు అవకాశమే ఇవ్వలేదు వెంకటపతి. రిక్షా వెళ్ళిపోయింది.

మౌనంగా ఇంట్లోకి నడిచిన శశికళ గేటువేస్తూ వెనుదిరిగి చూసింది.

సున్నంకొట్టిన గోడలా తెల్లబోయివుంది వెంకటపతి ముఖం. అతడ్ని ఆ స్థితిలోచూసి జాలిపడింది "లోపలికి రండి" అంటూ గేటు తెరిచింది.

"నీవు తెరిచింది ఇంటిగేటులుకాదు, నీ హృదయ కవాటాలు" అంటూ శశికళ ప్రేమ సామ్రాజ్యాన్ని సొంతం చేసుకున్న వీరుడులా లోపలికి ప్రవేశించాడు.

"కూర్చోండి" అంటూ డ్రాయింగు రూములోవున్న సోఫా చూపించి లోపలికి వెళ్ళింది.

"శశీ! ఎంత కాలానికి నీ ప్రేమసింహాసనాన్ని నాకు ఇచ్చావు" అంటూ వెళ్ళి సోఫాలో కూర్చున్నవాడల్లా ద్వారంలో కనిపించిన వ్యక్తిని చూసి దడాలునలేచి కూర్చున్నాడు.

కొం చెం వంగబడిన శరీరంతో, తెల్ల చీరలో, ముక్కుమీదకు జారిన కళ్ళజోడుతో ఆమె తన బామ్మలా వుందేగాని. తన బామ్మ కాదనుకొన్నాడు. ఎందుకయినా మంచిదనుకొని ఒక నమస్కారబాణం వదిలాడు.

"పెద్దవాళ్ళంటే భయభక్తులున్నాయి. బుద్ధిమంతుడే అనుకొని, "ఇంతకీ ఈ అబ్బాయి ఎవరో" అన్న అనుమానం రాగానే "నీ పేరేమిటి బాబూ" అన్నది.

"వెంకట్"

"ఇంటిపేరు"

చెప్పాడు.

"మనవాళ్ళే" అనుకొని; 'ఏవూరు నాయనా' అన్నది.

చెప్పాడు.

"అలాగా" అని. మా మేనత్తగారబ్బాయి మూడో కూతుర్ని మీవూరే ఇచ్చారు" అంటూ తీగ కదిపింది.

"ఆయన మా పినతల్లి బావమరిదే" అంటూ చుట్టరికం కలిపాడు.

"ఓ‌షేప్, ఇలా రావే" అని మనవరాల్ని పిలిచి, "ఇది నా కొడుకుకూతురు. వంటచేసుకొంటూ చదువుకోవ డం ఇబ్బంది అని నేనువచ్చాను" అన్నది.

అంతలో డ్రాయింగు రూములో కొచ్చిన శశికళ నుద్దేశించి, "ఈ అబ్బాయి ఎవరో తెలుసా? మీ బావ. అలా లోపలికెళ్ళిపోతావేంటి మనుషులొస్తే, నేను కాఫీ కలుపు కొస్తాను. మాట్లాడుతుండు" అంటూ ముక్కుమీదకుజారిన కళ్లజోడుని ఎగదోసుకుంటూ వెళ్ళింది.

"నేను ఏం చదువుతున్నానో తెలుసా?" అని, సెకండు బి.కామ్ నీవు జూనియర్ ఇంటర్. నావెంట పడ టానికి సిగ్గుగాలేదు" అన్నది.

మూగబోయింది వెంకటపతి కంఠం.

"మాట్లాడవేం?" రెట్టించింది.

అతి కష్టంమీద గొంతు పెగల్చుకొని "భార్యభర్తల్లో భర్తకే ఆధిక్యతకావాలనే వాదనని నేమనిరసిస్తాను. అందుకే అభిమానురాలయిన నిన్ను ఎన్నుకొన్నాను. పైపెచ్చు నేను నీకు బావని" అన్నాడు.

షాక్ తిన్నదానిలా చూస్తుండిపోయింది. ఆమె ఆ షాక్ నుంచి తేరుకోక పూర్వమే బామ్మ కాఫీ కప్పులతో

ప్రవేశించింది. బామ్మ చేతిలోని కాఫీ కప్పు అందుకొని లోపలికి వెళ్ళింది. కాఫీ సిప్‌చేస్తూ శశి వెళ్ళిన వైపే చూస్తున్న పతి చూపుల్ని గుర్తించి, "మా అమ్మాయికి మొగాళ్ళ ఎదుట పడటమంటే మహా సిగ్గు" అన్నది.

'అవును' అన్నట్టుగా వెర్రి నవ్వొకటి నవ్వాడు.

"కాఫీ ఎలా వుందయ్యా" అవి మా ఊళ్ళో ఒక్కొ-గేదె తపాలడు పాలిచ్చేవి. పొలాల్లో కమ్మని కూర గాయలు కాసేవి ఇక్కడికి వచ్చినతర్వాత కమ్మని పాలకి, కూరగాయలకి మొహంవాచిపోతున్నాం" అన్నది.

వెంకటపతి బుర్ర పాదరసంలా పనిచేసింది.

"ఆ విషయం నాతో మాటమాత్రంగా చెప్పరేం? మా బామ్మ వారానికొకసారయినా ఏదోఒకటి ఇచ్చి పంపు తుంది. మీకు ఏంకావాలో చెప్పండి. నేను తెప్పిస్తాను" అన్నాడు.

"అబ్బే పెద్దగా ఏమీ అక్కర్లేదు. గోంగూర పచ్చడి తినాలని వుంది. అలాగే సొర్రకాయ పాలకూర" అని, "ఇంతకీ మీరెంతమంది అన్నదమ్ములు?" అడిగింది.

చెప్పాడు.

అమ్మా నాన్న లేరని తెలిసి జాలిపడింది. ముప్పై ఎకరాలకు ఏకైక వారసుడని, ఎంచుకొనేవారు_పంచుకొనే వారు లేరని గ్రహించి, సంతోషించింది.

*　　　*　　　*

విషయం విన్న లక్ష్మణ్, సత్తిరాజు, స్వామి చాలా సంతోషించారు. "పోన్లేరా, నలుగురిలో ముగ్గురం మూడు దోవలు చూసుకున్నాం. నాలుగోవాడే ఏమైపోతాడో అని బాధపడేవాళ్ళం. ఇప్పుడు నీవూ ఒక జంటగాడివయ్యావు. మాకదే సంతోషం" అన్నాడు లక్ష్మణ్.

"ఒరేయ్, లవ్ ఎఫైర్స్ టేకిట్ చేయడం - ఏది ఆ అమ్మాయికి గనక వెనక తాతలు, అమ్మమ్మలు. బుజ్జి తమ్ముళ్ళు వుంటే చాలా తేలిక. ఎలాగంటే తాతయ్యలకి నస్యం పీల్చడం లేదా పొగాకు కాల్చడం, లేదా భగవద్గీత చదవడం ఎలాగూ అలవాటుంటుంది. పది రూపాయలు ఎక్కువ ఇచ్చయినాసరే మార్కెట్‌లో నాణ్యమైన పొగాకు లేదా నస్యం కొనుక్కొచ్చి తాతగారికి ఇచ్చెయ్. ఇవీగాక పోతే బ్రహ్మాండమైన చేతికర్ర కొనివ్వు, వీటితో అంత వయసున్న తాతగారు నీకు శిష్యుడై పోతాడు. తమ్ముళ్ళున్నా రనుకో వాడికి చాక్లెట్లు, గోలీకాయలు కొనివ్వాలి. అదే బామ్మగారనుకో- ఫ్రెష్ విజిటబుల్స్ మా ఇంటిదగ్గర్నుంచి వచ్చాయి అంటూ మార్కెట్‌లో అవేకే కొన్నవి ఇచ్చిరా. అదేగాక పోతే రామారావు రాముడుగానో కృష్ణుడుగానో నటించిన సినిమా లొస్తున్నాయి. వాటికి బామ్మగార్ని తీసు కెళ్లు. ఇహ ఇంతే సంగతులు - నీవు తంతే వెళ్ళి బూరెల తట్టలో పడ్డట్టే, విష్ యు గుడ్ లక్" వీపు తట్టాడు సత్తిరాజు.

మరుసటి రోజు

తల చిక్కుదీసుకుంటున్న శశికళ గేటు చప్పుడయి నట్లుంటే 'ఎవరు' అంటూ కిటికీలో నుంచి బయటకు చూసింది. సైకిల్ స్టాండు వేస్తున్న వెంకటపతి కనిపించాడు.

సైకిల్ క్యారేజిమీద కట్టగా కట్టిపెట్టిన గోంగూర వుంది. సైకిల్ హ్యాండిల్‌కి ఇరువైపులా రెండు సంచు లున్నాయి. వాటిలో కూరగాయలున్నాయి కాబోలు నిండుగా వున్నాయి. వెంకటపతి భుజాన పొట్లకాయలు వ్రేలాడు తున్నాయి. క్యారేజీమీదున్న గోంగూర కట్టల్ని తీసి నెత్తి మీద పెట్టుకున్నాడు. కూరాగాయ సంచులు రెంటినీ రెండు చేతుల్లోకి తీసికున్నాడు — అన్నీ ఒకేసారి తీసికెళ్తేగాని

బామ్మగారికి గుడ్ ఇంప్రెషన్ పడదని వెంకటపతి అభిప్రాయం,

తలమీద బ్యాలెన్సు తప్పకుండా వస్తున్న వెంకట పతిని ఆ విధంగా చూసేసరికి శశికళకు నవ్వొచింది. అసలే భారీ శరీరం. పైపెచ్చు తలమీద, భుజాలమీద, చేతుల్లోను బరువు, తలమీద బ్యాలెన్సు తప్పకూడదని అడుగులో అడుగు వేసుకుంటూ వస్తున్న వెంకటపతిని ఆటపట్టించాలన్న చిలిపి ఆలోచన ఆమెలో చోటుచేసుకుంది.

"హాచ్" అంటూ హఠాత్తుగా తుమ్మింది.

ఉలిక్కి పడ్డాడు. తలమీద వున్న గోంగూర కట్ట, భుజాన వ్రేలాడుతున్న పొట్లకాయలు క్రింద పడ్డాయి.

ఆ మోతకి బామ్మగారు వంట ఇంట్లో నుంచి బయటకు వచ్చింది. ఆ దృశ్యాన్ని చూసి" ఏమిటియ్యా ఇదంతా, ఇవన్నీ ఎక్కడివి?" సాగదీసుకుంటూ అడిగింది.

"మా బామ్మ పంపించింది మీకు ఇవంటే ఇష్టమని పట్టుకొచ్చాను"

"మానాయనే ఈ ముసలిదంటే నీకెంత శ్రద్ధ" అని "నీవక్కడ కూర్చో" అంటూ కుర్చీ చూపించింది.

"ఈ వయసులో వున్న మీరు ఇవన్నీ మోస్తారా? పైగా నేను చూస్తుండగా" అంటూ చొరవగా చేతిలోని కూరగాయ సంచుల్ని వంట ఇంట్లోకి తీసికెళ్ళాడు. మళ్ళీ వచ్చి గోంగూర కట్టని, పొట్లకాయ ముక్కల్ని తీసికెళ్ళాడు.

"పిల్లోడు చాలామంచోడు. ఈకాలంలో ఇంత బుద్ధిమంతులుండటం ఆశ్చర్యమే" స్వగతంగా అనుకున్నా పైకి వినిపించాయి బామ్మమాటలు.

"ఈ దింపాగాడు బుద్ధిమంతుడు కాదు. పెద్దజులాయి అమ్మాయిల వెంటపడతాడు" అని చెప్పాలనుకుంది కాని, "అలాంటి వాడిని ఇంటికి ఎందుకు తీసికొచ్చావే" అనడుగు

తుందేమోనని భయపడి ఆ ప్రయత్నాన్ని విరమించుకొంది శశికళ.

"బాబూ! నేను కాఫీ పట్టుకొస్తాను గాని నీవువెళ్లి ఇంటిముందు కూర్చో" అని బామ్మ అనడంతో వచ్చి. ఇంటల్లుడులా దర్జాగా బాసిపట్లు వేసుకొని సోఫాలో కూర్చు న్నాడు. అతడ్ని ఆ స్థితిలో చూసేసరికి శశికళకు కోపం వచ్చింది. "ఏయ్ కాళ్ళు క్రిందపెట్టు" అనగానే అనాలో చితంగా కాళ్ళు క్రిందపెట్టాడు.

"స్టెండప్" అనగానే మారు మాట్లాడకుండా లేచి నిల్చున్నాడు.

"గెటౌట్" గేటు చూపిస్తూ అన్నది.

కాని ఈతపా బయటకు నడవలేదు. మౌనంగా సోఫాలో కూర్చున్నాడు. పై పెచ్చు కాలిమీద కాలేసుకొని కూర్చున్నాడు,

"నీక్కాదు చెప్పేది"

"బామ్మ నన్ను ఇక్కడ కూర్చోమంది"

"అసలెందుకు వచ్చావ్" ఉక్రోషంగా అడిగింది,

"బామ్మకోసం"

అంతలో "అమ్మాయ్ శశీ!" అన్న పిలుపు వంట ఇంట్లోనుంచి వినిపించడంతో, "వస్తున్నా" అంటూ కోపా న్నంతా అణచుకొంటూ వెళ్ళింది.

"అబ్బాయికి కాఫీ ఇవ్వు"

"నేను ఇవ్వను"

"చదువుకుంటున్న పిల్లలు. మీకూ ఇంత సిగ్గయితే ఎలా ?" అని. "తీసికెళ్ళు అంటూ చేతిలో పెట్టింది.

'తపా తప. కాళ్ళతో నేలచరుస్తూ వచ్చి 'ఇంద' అంటూ కాఫీకప్పు చేతిలో పెట్టింది.

"థాంక్యూ" అంటూ కాఫీ సిప్ చేయటం ప్రారంభించాడు.

"ఇహ ఈ ఇంటికి రాకు, వచ్చావా మర్యాదగా వుండదు" లోస్వరంలో హెచ్చరించింది.

"నీకోసం రావట్ంలేదు"

"నీవు ఎవరికోసం వస్తున్నావో నాకు తెలుసు.. మరోమారు ఇలాటి పిచ్చివేషాలేశావంటే ఆ జుత్తు కత్తిరించే సవరం కట్టించుకుంటా - జాగ్రత్త"

భద్రకాళిలా అవతారమెత్తిన శశికళ రూపాన్ని చూసి ఏమనుకున్నాడో ఏమోగాని మౌనంగాలేచి, "బామ్మ వెళ్లొస్తా" అని సమాధానం కొరకయినా ఎదురు చూడకుండా వెళ్లిపోయాడు.

నిత్యం కాలేజీకి వెళ్ళేటప్పుడు, కాలేజీనుంచి వచ్చేటప్పుడు బాడీగార్డులా తనని వెంబడించే "వెంకటపతి" జాడే లేకపోవడంతో "పాపం మానవుడు, బేజారెత్తి పోయినట్టున్నాడు" అనుకుంది.

కాని ఆ అభిప్రాయం ఎంతోసేపు నిలవలేదు.

ఇంట్లోకి అడుగుపెట్టిన శశికళ వంట ఇంట్లోనుంచి ఏవో మాటలు వినిపించడంతో, "ఎవరా" అని కుతూహలంగా తొంగి చూసినదల్లా అక్కడ కనిపించిన దృశ్యాన్ని చూసి హతాశురాలయింది.

బామ్మ వెంకటపతి ఎదురెదురుగా కూర్చునున్నారు. మధ్యపీట వుంది. ఆ పీటమీద వేరు సెనకాయలు కొట్టి వలుస్తున్నారు.

ద్వారం ఫ్రేము కట్టిన ప్రతిమలా నిలుచున్న శశికళని చూసి, "రావె అమ్మాయ్. వెంకట్ వాళ్ళ అమ్మమ్మగారు వేరుశనక్కాయలు పంపారట. పాకం పట్టి ఉండలు చేద్దామని వలుస్తున్నాం. నీవూ వచ్చికూర్చో" అన్నది

కాని ముఖం చిట్లించి వెళ్ళిపోయింది. అది గ్రహించి వెంకటపతి ఎక్కడ బాధపడతాడోనని, "కాలేజీ నుంచి వచ్చిందిగదా, చీరమార్చు కోవడానికి వెళ్ళింది" అని సర్ధి చెప్పింది బామ్మ.

"అవునా" అన్నట్టుగా వెకిలి నవ్వొకటి నవ్వాడు.

"ఇతంకి ఎకరం ఎంతచేస్తుందన్నావ్"

"పదివేలు"

"మొత్తం ముప్పై ఎకరాలున్నాయన్నావుగదా?"

"అవును" అన్నట్టుగా తలూపాడు.

*　　　*　　　*

తల్లి దగ్గరనుంచి ఉత్తరం అందగానె రెక్కలు కట్టుకొని వాలాడు శశికళ తండ్రి. ముప్పై ఎకరాల సుక్షేత్రమయిన మాగాణి. ఎంచుకొనేవాడు, పంచుకొనేవారులేరు. పై పెచ్చు రేపోమాపో రాలిపోయే ముసలమ్మ మినహా అత్తపోరు మామపెత్తనం లేదు. అన్నింటినీమించి వెంకటపతి పెద్ద అందగాడు కాకపోయినా తీసివేయదగినవాడు కాదు——

అమ్మాయి వెంటే మొదటిసారిగా అబ్బాయి ఇంటకి వచ్చాడాని, వారిదరూ తరచుగా కలిసే వస్తారని తెలుసుకున్న ఆ తండ్రి ఇదేదో ఆ వ్యవహారమే. చూసుకుంటే చూసుకుండి కొంచెం గట్టివాడ్నే చూసుకుంది. ఈ విషయం నలుగురికీ తెలియకముందే ఆ మూడుముళ్ళూ వేయిస్తే గౌరవం, అనుకొని, "సరేలేవే. అమ్మాయికీ అబ్బాయికీ ఇష్టమయింది. అబ్బాయికి వెనక కాదో నాపొప్పుంది. ఇహ మనం ఒభ్యంతరం చెప్పవలసింది ఏముంది. అయినా ఆడపిల్ల వాళ్ళంగదా, మంచి-చెడు కనుక్కొంస్తాను. అసలు వాళ్ళెంతలో వున్నారో కూడా తెలుసుకొస్తాను" అని తల్లితో చెప్పి వెళ్ళిపోయాడు ···ళ తండ్రి

ఆ రోజున వచ్చిన వెంకటపతిని అడిగింది బామ్మ. "మా అమ్మాయిని పెళ్లి చేసుకోరాదా" అని.

ఆ విషయం వింటూనె వెంకటపతి ఆనందంతో పిల్లి మొగ్గలు వేయలేదుగాని, దాదాపు అంత పని చేశాడు.

చుట్టపు చూపుగా వచ్చిన తన దూరపు చుట్టం శశికళ తండ్రి — ద్వారా అసలు విషయం తెలుసుకొని, "ఓరీది జిమ్మడా! గోరు ముద్దలు చేసి పెడితేగాని భోజనం చేయలేదు. అలాంటిది ఇంత గ్రంథం నడిపాడా. తేలుస్తాను వాడి వ్యవహారం" అనుకొని స్వయంగా బయలుదేరి వచ్చింది.

నరసింహావతారం ఎత్తిన ఆ మహావిష్ణువు చెంచు లక్ష్మిని చూసి శాంతించినట్లు కారాలు, మిరియాలు నూరుతూ, "ఇహ చదువు మానేసి ఇంటిదగ్గర వ్యవసాయం చేసుకో" అంటూ వచ్చిన బామ్మ శశికళని చూసి అర్జంటుగా తన అభిప్రాయాన్ని మార్చేసుకుంది.

చక్రల్లాంటి కళ్లతో, తీర్చిదిద్దినట్లున్న కనుబొమ్మలతో, విశాల మయిన పాల భాగంతో, సన్నని నడుంతో, ఎర్రని శరీర ఛాయతో మెరుపు తీగలా బాపు బొమ్మలావున్న శశికళని చూసి "చందనపు బొమ్మలావుంది మా మనమరాలు" అంటూ తలపై నొటికలు విరుచుకుంది. "మా వెంకటపతి ఎంత అదృష్టవంతుడో" అని పదేపదే అనుకొంది. బామ్మలిద్దరూ కలిశారు. శశికళ- నాయనమ్మ వెంకటపతి ఎంత బుద్ధిమంతుడో పొగుడుతుంటే, వెంకటపతి అమ్మమ్మ శశికళ ఎంత అందగత్తో మెచ్చుకోసాగింది. వీరిద్దరూ ఇలా తాళాలు వాయిస్తుంటే మెల్లగా శశికళ దగ్గరకు వెళ్ళాడు వెంకటపతి.

"నీవుత్త దొంగవి"—శశి

"అవును నీ హృదయం దొంగిలించినవాడిని దొంగని కాక ఏమవుతాను ?" — వెంకట్

"నీవంటే నాకు అసహ్యమే"

"ప్రేమకు ముందు వుండేది అసహ్యమే!"

"నేను నిన్ను పెళ్లి చేసుకోను" అంటూ వెళ్లింది. తండ్రితో అదేచెప్పింది. "ఇప్పుడిలా పేచీ పెట్టడం తప్పమ్మా" అని కొట్టిపారేశాడు. ఆమె మాటల్ని ఎవరూ పట్టించుకోలేదు.

సంక్రాంతి కానుకగా ఇద్దామని వెంకటపతి కొన్న చీరనే శశికళకు కట్టబెట్టారు. నిశ్చయ తాంబూలాలు పుచ్చుకున్నారు.

"ఓర్ని, పంచకట్టుకొని, గూడెం చెప్పులతో భుజాన పెట్టి పెట్టుకొని వచ్చిన ఆ వెంకట పతేనా లవ్ మ్యారేజీ చేసుకోబోతున్న ఈ వెంకటపతి-ఆశ్చర్య పోయాడు మధు, విషయంవిని విక్కురు వేసుకొని చొక్కా లేకుండా నల్ల మృగంలా హాస్టల్‌వరండాలో తిరిగిని ఆ వెంకటపతికాదు ఈ వెంకటపతి. ఏడు నెలలు కాలేజీ జీవితం ఇతడిలో గణనీయమైన మార్పుని తెచ్చింది. భుజాలమీద పడుతున్న ఆ జుత్తు మొక్కుబడికి పెంచింది కాదు — హిప్పీజుత్తు. ఫ్యాషను కొరకు పెంచింది. అతడు ధరించింది లొటలొటా ప్యాంటు కాదు—బెల్‌బాటమ్. ఈ వెంకటపతి రొమాంటిక్ హీరో.

టేబుల్ ముందు కూర్చుని వ్రాసుకుంటున్న రఘు అడుగుల సవ్వడికి తలెత్తాడు. "అన్నయ్యగారూ! నా మ్యారేజి సెటిలయింది. అదీ మీ ఫ్రెండు వెంకటపతితో, నాకిష్టంలేదు, కాని ధింతా ఈపెళ్లి నాకిష్టమే అనుకుంటున్నారు. ఇప్పుడు నేను చేయగలిందే ఏమీలేదు. నాకుఅన్న లేరు, మీతో నాకిదే తొలిపరిచయం, కాని ఎప్పట్నుం... మీలో ఒక అన్నయ్యని చూసుకుంటున్నాను. ఈవేళే స... నిశ్చితార్థ మయింది. నానుదుట కుంకుమ దిద్ది ఒక అన్నగా నన్ను ఆశీర్వదించండి" అంటూ చేతిలోని కుంకుమ పొట్లాన్ని ముందుకు చాచింది.

స్నేహ

"నా నుదుట కుంకుమ దిద్దండి" అంటూ అమ్మవారి గుడినుంచి తెచ్చిన కుంకుమ పొట్లాన్ని అందించిన కుసుమ అతడి స్మృతి పథంలో మెదిలింది.

"నన్ను క్షమించమ్మ" అంటూ వడివడిగా అడుగు లేసుకుంటూ పూలతోటలోకి నడిచిన వాడల్లా తెల్లని షిఫాన్ జార్జెటు చీరధరించి దోవకి అడ్డంగా నిల్చునున్న వ్యక్తిని చూసి అప్రయత్నంగా ఆగిపోయాడు.

అవే సోగకళ్లు.

అవే చిలిపి నవ్వులు.

అవే సొట్ట బుగ్గలు,

ఆమె కుసుమ.

"కుసుమా'' అంటూ గావుకేక పెట్టి ముందుకు అడుగేశాడు కాని అతడిలో ఒక్కసారిగా వెల్లువలా పెల్లుబికిన ఆ ఆనంద తరంగాన్ని ఆ హృదయం భరించలేకపోయింది.

"కుసుమా" అంటూ కుప్పలా కూలిపోయాడు రఘు.




హితులు, సన్నిహితులు, ఉన్నతులు, పూజ్యులు

చిట్టిబాబు గారికి

— అశాంత



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనా

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M122 |
| పుస్తకం పేరు | వవలా స్నేహ |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 131 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 6 · Bri |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Susmitha |
| పేజీలు విడదీసినది | Vasia |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | [illegible] |